# రాజపాళయం రాజకవుల యక్షగానములు

●

* సీతాకల్యాణం — గొట్టుముక్కల కృష్ణమరాజు
* పారిజాతాపహరణం — గొట్టుముక్కల సింగరాజు
* సావిత్రి — గొట్టుముక్కల కుమారపెద్దిరాజు

●

పరిష్కర్త:

డా॥ తిమ్మావజ్ఝల కోదండరామయ్య, M. A.

తెలుగుశాఖాధ్యక్షులు, మధురై కామరాజ విశ్వవిద్యాలయం, మధురై.

ప్రచురణకర్త:

బహుభాషాప్రవీణ ముదునూరి జగన్నాథరాజు

అధ్యక్షుడు, తెలుగువిద్యాలయం, రాజపాళయం.

●

ప్రచురణ:

తెలుగు విద్యాలయము

రాజపాళయం (తమిళనాడు)

1981

**RAJAPALAYAM RAJAKAVULA YAKSHAGANAMULU** (Telugu literature)

First Edition 1000
January 1981

*Publishers:*
**Telugu Vidyalayam,**
Rajapalayam - 626 117.

*Distributers:*
**Viswasanthi Pathippagam,**
Rajapalayam.

*Printers:*
VEDAM VENKATARAYA SASTRY & BROS,
3, Mallikeswarar Koil South Lane,
Lingi Chetty Street,
MADRAS - 1

**Price Rs. 6**

# Telugu Vidyalayam

**(Institute for The Development of Telugu Language Literature and Culture in Tamilnadu)**

**RAJAPALAYAM**

626 117

*Honourary President:*

P. R. Ramasubrahmaneya Rajah, B. Sc.
Chairman. Ramco Group of Industries, Rajapalayam

*Patrons:*

N. A. Ramachandra Raja.
President. Raju's College, Rajapalayam.

P. K. Ramasamy Raja.
Chairman. Sriram Group of Industries, Rajapalayam

*President:*

Mudunoori Jagannatha Raju.
(Lingustic Scholar and Poet) Rajapalayam.

*Vice Presidents:*

Dr. K. Alagaraja, M. A., M. Sc. Ph. D.

M. K. Ramachandra Raja. B. A., B. T.

*Secretaries:*

K. M. Kothandam.

P. A. Durai Raja.

*Treasurer:*

K. R. Velayutha Raja.

# విశ్వశాంతి ప్రచురణలు

## బహుభాషాప్రవీణ ముదునూరి జగన్నాథరాజుగారి కృతులు

తమిళము :

1. కన్యాశుల్కం—(గురుజాడవారి తెలుగు నాటక తమిళానువాదము)
2. వేమన్న—(అనువాదం)
3. కళాపూర్ణోదయం—(పింగళి సూరన కావ్యానువాదం)
4. కర్పనై పాఙ్గై—(స్వీయకవిత్వం)
5. దర్శనం— ( ,, )
6. గాథాసప్తశతి—(ప్రాకృత కవితాసంకలనో తమిళానువాదం)
7. నాగానందం—(సంస్కృత నాటకానువాదం)
8. ఆపుత్రకావ్యం—(కావ్యం)
9. తెరు (వీథి)— ( ,, )
10. జైనతత్త్వం—

తెలుగు :

11. శైలగీతము—(అతి ప్రాచీన తమిళ సాహిత్య పరిచయముతో "కలింజి ప్పాట్టు" పద్యానువాదము)
12. ముత్యాలహారము—(క్రీ. శ. ఐదవ శతాబ్దపు కవితాసంకలనమైన "ముత్తొళ్ళాయిరం" తెలుగు పద్యానువాదం)
13. తిరుక్కుఱళ్ తేటగీతులు—

మలయాళం :

14. ముత్తొళ్ళాయిరం—

కన్నడం :

15. ముత్తొళ్ళాయిరం—

# Thanks, To The Donors for this Publication

| | | |
|---|---|---|
| 1. | The president and<br>The Director<br>International Telugu Institute,<br>Hyderabad. | Rs. 2000 — 00 |
| 2. | P. R. Ramasubrahmaneya Rajah,<br>Chairman. Ramco Group of Industries,<br>Rajapalayam. | Rs. 1000 — 00 |
| 3. | P. K. Ramasamy Raja,<br>Chairman. Sriram group Industries. | Rs. 1000 — 00 |
| 4. | Palayapalayam. Rajus Common Fund | Rs. 1000 — 00 |
| 5. | Sakkarajahkottai. Rajus Common Fund. | Rs. 1000 — 00 |
| 6. | Singarajakottai. Rajus Common Fund. | Rs. 1000 — 00 |

# విషయసూచిక

# సమర్పణ

మద్రాసు రాష్ట్రప్రధానిగను, ఒరిస్సా గవర్నరుగ నుండిన మాన్యసుచరితులు, ఆంధ్రదేశ రాజులకూ, రాజపాళయం రాజులకు పొత్తుకుదిర్చినవారునగు త్యాగశీలి

కీ. శే. శ్రీ పూసపాటి కుమారస్వామిరాజాగారికి,

ఆంధ్రాభిమానముతో వెలసిన, న్యాయమూర్తులైన

కీ. శే. A. K. D. వెంకట్రాజుగారికి,

దానవీరులు, ఆంధ్రదేశరాజులకు, రాజపాళయం రాజులకు మైత్రి నెలకొల్పిన త్యాగమూర్తులైన, పత్తేపురం నివాసులైన

కీ. శే. చింతలపాటి బాపిరాజుగారికి

స్మృతిచిహ్నముగా

ఈ కృతి సమర్పితము.

## GRACING THE OCCASION OF RELEASE OF YAKSHAGANAS



**:ting** : Dr. P. Venkat Raju, M.A., (D. N. R. College, Beemavaram, A. P.) Kavi Yogi Suddhananda Bharathi, D. K. Raju (Ex. M. L. A.), K. S. Kothandaramaiah, B.A , B.T., (Ex. M. L. A , Hosur) N. Ramabhadra Raju, (Ex. M. L. A , Amalapuram). K. A. A. Raja, (Ex. Governor of Arunachal Pradesh), R V. S. S. Raju, B.A., B.L., N. A. Ramachandra Raja, (President, Rajus' College) Bhahu Bhasha Praveena Mudunoori Jagannatha Raju,

**:anding:** Telugu Vidyalaya Office Bearers.

Dedicated to



**P. S. KUMARASWAMY RAJA**

Ex. Chief Minister of Madras

Ex. Governor of Orissa

**( 1898 - 1957 )**

## HONORARY PRESIDENT



GURU BHAKTA MANI

**P. R. RAMASUBRAHMANEYA RAJHA**

Chairman : Ramco Group of Industries

Philanthropist

**RAJAPALAYAM.**

PATRON



**N. A. RAMACHANDRA RAJA**
President, Rajus' College
Managing Director, Janakiram Mills
**RAJAPALAYAM.**



**P. K. RAMASAMY RAJA**
Chairman, Sriram Group of Industries
**Philanthropist**
**RAJAPALAYAM.**

## PRESIDENT



BHAHU BHASHA PRAVEENA

**Mudunoori JAGANNATHA RAJU**

President :

TELUGU VIDYALAYAM & MANIMEKALAI MANRAM

**Scholar, Author, Critic, Poet and Linguist**

**RAJAPALAYAM.**

## VICE PRESIDENTS



**Dr. K. ALAGARAJA,** M.Sc.,
Scientist
CEM - F - R. INSTITUTE
**COCHIN - 682 018**



**M. K. RAMACHANDRA RAJA**
B.A., M.Ed.,
Head Master
GOVT. HIGH SCHOOL, KALLAMANAICKERPATTI
**RAJAPALAYAM**



**KO. MA. KOTHANDAM**
Secretary : TELUGU VIDYALAYAM &
MANIMEKALAI MANRAM
**Writer and Poet**
**RAJAPALAYAM**



**K. R. VELAYUTHA RAJA**
Treasurer : TELUGU VIDYALAYAM
Secretary :
DAKSHINANDHRA BHASHA SAMITHI
**Writer and Poet**
**GUDALUR - 627 758**



**P. A. DURAI RAJA**
Secretary : TELUGU VIDYALAYAM
& MANIMEKALAI MANRAM
**Writer and Poet**
**RAJAPALAYAM**

# EDITOR



**Dr. T. KOTHANDARAMAIAH,** M.A , Ph.D.,

Proffessor of Telugu

MADURAI KAMARAJ UNIVERSITY

**Research Scholar, Critic and Author.**

# మున్నుడి

ఆంధ్రవాఙ్మయచరిత్రలో దక్షిణాంధ్రవాఙ్మయమునకు విశిష్టస్థానము కలదు. కవిత్రయం, కవిద్వయం, అష్టదిగ్గజముల తర్వాత పేరెన్నికగన్న కవివరులు దక్షిణాంధ్రముననే వెలసినారు. శ్రీకృష్ణదేవరాయలకాలములో నాయకరాజులు తంజావూరు, మధురలందు పరిపాలన సాగించినప్పుడు ఆంధ్రసరస్వతికి నిలాస స్థానమైన తమిళనాడులో తెలుగు రాజభాషగా వెలసింది. నాయకరాజ్యపాలనం క్రీ. శ. 1550 నుండి 1855 వఱకు సాగినది. ఆ తర్వాత తంజావూరులో మహారాష్ట్ర రాజులు, పుదుక్కోట తొండమానులు కూడా తమ మాతృభాష, ప్రాంతీయభాషలు వేఱైనా తెలుగులోనే సాహిత్యపోషణం గావించినారు. కవులను ఆదరించుటే గాక తాము కూడా స్వయంగా కవులుగా వెలసిన రాజులచే ఆంధ్రసాహిత్యం మూడు పువ్వు లాఱు కాయలుగా సమృద్ధిగా వెలసింది. ఆంధ్రసాహిత్యమున క్రొత్తరీతు లుద్భవించినది. వచనములు, నాటకములు అవతరించినవి. తంజావూరులో, రఘునాథ నాయకుడు, విజయరాఘవనాయకుడు, మన్నారుదేవుడు, శహాజీ, తులజాజీ, శరభోజీ మొదలగు రాజులు ఎన్నో యక్షగానాలు రచించినారు. కావ్యాలు మలచినారు. మధురవాణి, రంగాజీ, ముద్దుపళని వంటి కవయిత్రులు వెలసినారు. చేమకూర వేంకటకవి, కవిచౌడప్ప, క్షేత్రయ, చెంగల్వకాళకవి, కస్తూరిరంగకవి, త్యాగయ్య మొదలగు కవులు, కావ్యములు, గేయములు రచించిరి. మధురలో, శ్రీ కామేశ్వరకవి, గణపవరపు వేంకటకవి, శేషము వేంకటపతి, సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు మొదలగు కవులు అద్వితీయప్రతిభతో కావ్యాలు వెలయించినారు. విజయరంగ చొక్కనాథుని ఆస్థానము ఆంధ్రసాహిత్యమునకు ఆలవాలమైయుండినది.

పుదుక్కోటలో రఘునాథతొండమాన్ పార్వతీపరిణయం వంటి కావ్యాలు రచించి, కవిపండిత గాయకులను పోషించి కీర్తిగాంచెను. నుదురుపాటి వెంకన్న, మన్నారయ్య, నవనప్ప వంటి కవులు వెలసినారు.

దక్షిణాంధ్రవాఙ్మయ కేంద్రములుగా తంజావూరు, మధుర, పుదుక్కోట అను మూడు నగరములు ఇంతవరకు సుపరిచితమైనవి. ప్రస్తుతం నాల్గవ కేంద్రముగా రాజపాళయం కూడా ఉండినదని సగర్వముగా తెల్పుకొనుటకు సంతోషించుచున్నాను.

రాజపాళయం, తమిళనాడులో దక్షిణాగ్రమున, రామనాథపురంజిల్లాలోనున్నది; శ్రీకృష్ణదేవరాయలు కావ్యరూపంలో మలచిన 'ఆముక్తమాల్యద' ఐన శ్రీ గోదాదేవి (నాంచారు) జన్మస్థలమైన శ్రీ విలుబుత్తూరుకు దక్షిణముగా ఏడుమైళ్ళ దూరంలో నున్నది. మధురనించి దక్షిణముగా యాభైమైళ్ళ దూరంలో నున్నది. రాజపాళయం నిర్మించినది ఆంధ్రరవికుల క్షత్రియ రాజులు. వీరు కృష్ణదేవరాయల కాలంలో, విశ్వనాథనాయకుని సైన్యములో మధురకు వచ్చిరనియు, తర్వాత ఇక్కడే స్థిరపడి నిలిచిపోయి రాజపాళయం పురనిర్మాణం చేసినారనియు తెలియుచున్నది. ఇక్కడ ఇప్పటికీ, తెలుగురాజవంశమే పలుకుబడితో, మాతృభాషయైన తెలుగును మఱవకుండ మాటలాడుచు తెలుగు సంస్కృతిని నిలబెట్టుకొనియున్నారు.

ఇక్కడి రాజవంశమున, ఆంధ్రలో గోదావరి, విశాఖపట్నం జిల్లాలలోనున్న రాజులవలెనే, నాల్గు గోత్రములు (వశిష్ఠ, ధనంజయ, కాశ్యప, కౌండిన్య) ఉన్నవి. ఇంటిపేరులు కూడా ఆంధ్రలో నున్నవే. పూసపాటి, గొట్టుముక్కల, దాట్ల, పేర్చర్ల, వత్సవాయ, ముదునూరి, జుజ్జూరి, మంతెన, మందపాటి, దంతులూరి, సాగి, ఇందుకూరి, వేగేశన, చింతలపాటి, నంబూరి, చేకూరి, పెనుమత్స, నంద్యాల, మొదలగు ఇరవైయాఱు ఇంటిపేరు లున్నవి. ఆంధ్రదేశంలో నూటముప్పది ఇంటి పేర్లున్నవి. ఆంధ్రదేశంలో లేని ఇంటిపేర్లు ఎఱ్ఱగుంటల, కాశి అను రెండు ఇక్కడ ఉన్నవి. ఎఱ్ఱగుంటల కూడా ఆంధ్రదేశములోని గ్రామ నామమే అనునది గుర్తింప తగినది. వివాహాది కార్యక్రమాలు, కులకట్టుబాట్లు ఆంధ్రదేశ రాజులవలెనే ఉన్నవి. శ్రీ బుద్ధరాజు వరాహాలరాజు రచించిన "ఆంధ్ర క్షత్రియ రాజవంశ రత్నాకరము" లో రాజపాళయంలోని రాజులను గుఱించి విరివిగా వ్రాసియున్నారు.

రాజపాళయము రాజులు మూడు కోటలుగా విభాగించియుండిరి. ఒక్కటి పాతపాళయం, రెండవది జగ్గరాజుకోట, మూడవది పింగరాజుకోట. ఇక్కడి రాజుల వివాహసంబంధములు రాజపాళయమున మాత్రమే చేసుకొంటారు. ఆంధ్రదేశ రాజులతో ఇప్పుడిప్పుడే మైత్రి కుదిరింది. కాని ఇంతవరకు వివాహసంబంధం జరగలేదు. భావికాలములో వియ్యా లందుకోగలరని భావిస్తున్నాను.

ఇక్కడి రాజులు జనాభా ముప్పదివేలున్నారు. వీరు కృషి, వాణిజ్య, కర్మాగారములందు, ముందంజవేసి ఐశ్వర్యాభివృద్ధితో తమిళనాడులోనే పేరెన్నిక గన్నవారైయున్నారు.

ఉమ్మడి మదరాసురాష్ట్ర ప్రధానిగానూ, ఒరిస్సా గవర్నరుగానూ పదవి వహించిన కీ. శే. పూసపాటి కుమారస్వామిరాజుగారు, కర్మాగారములు, విద్యాలయాలు నెలకొల్పిన, పూసపాటి రామస్వామిరాజుగారు, వీరి కుమారుడు, సుప్రసిద్ధ కార్మాగార వేత్తయు, ప్రగతిశీల ఉదారస్వభావులునైన శ్రీ పూసపాటి రామసుబ్రహ్మణ్యరాజుగారు (Chairman. Ramco Group of Industries), శ్రీ A. K. D. ధర్మరాజుగారు, శ్రీ A. K. D, వేంకట్రాజు, శ్రీ D. K. రాజు, శ్రీ K. S. రంగస్వామిరాజు, శ్రీ K. A. A. రాజు (అరుణాచలప్రదేశ్ లెప్టినెంట్ గవర్నరుగానుండిరి) శ్రీ మేజర్ జనరల్ K. A. S. రాజుగారు, శ్రీ P. K. రామస్వామిరాజుగారు, N. A. రామచంద్ర రాజుగారు మొదలగు సుప్రసిద్ధ వ్యక్తులు రాజపాళయమునకు కీర్తిఘటించినారు. రాజపాళయం రాజులు స్వాతంత్ర్య పోరాటములో పాల్గొని త్యాగశీలు రనిపించు కొన్నారు. శ్రీ ఇందుకూరి రంగస్వామిరాజు, శ్రీ పూసపాటి చినవెంకట్రాజుగారు, పేర్చర్ల సుబ్బరాజుగారు, శ్రీ ముదునూరి గురుస్వామిరాజుగారు, శ్రీ P. S. వసంత గార్లు ముఖ్యులు. రాజకీయరంగంలో శ్రీ A. A. సుబ్బరాజు, శ్రీ తిలక్ మొదలగు వారు పేరెన్నికగన్నారు. సాహిత్యరంగంలో బహుబాషాప్రవీణ ముదునూరి జగన్నాథ రాజు (రచయిత), శ్రీ గొట్టుముక్కల కోదండరాజు, శ్రీ K. S. బలరాం' శ్రీ పూసపాటి దుర్రైరాజు, శ్రీ గొట్టుముక్కల వేలాయుధరాజుగార్లు ప్రసిద్ధులు.

ఇట్లు కార్మిక, వాణిజ్య, రాజకీ, యార్థిక, సాహిత్యరంగములందు తమిళ నాడులో ముందంజవేసి మేలుబంతిగా మెలగుచున్న ఆంధ్ర క్షత్రియ రాజకులమున 17 వ శతాబ్దమున జన్మించిన కవివరులు శ్రీ గొట్టుముక్కల కృష్ణమరాజు, వారి కుమారులు సింగరాజు, కుమార పెద్దిరాజు అను కవిత్రయమువారి యక్షగానములే ఈ "రాజపాళయం రాజకవుల యక్షగానములు".

శ్రీ మహామండలేశ్వర, గొట్టుముక్కల సింహాసనస్థుడు, ధనంజయ గోత్రుడు వరదరాజు రాజపాళయం ఏలిన దొరలం దొకరు. ఇతడు మంచి కవి. ఇతనికి కుమారపెద్దిరాజు అను నామాంతరము కూడ కలదని ఊహింపవలసియున్నది.

ఇతని భార్య వెంకటాంబ. వీరికి ఇద్దరు కుమారులుండిరి. పెద్దవారు పండితులైన వెంకటరాజు. తమ్ముడు కృష్ణమరాజు. వెంకటరాజును సుగుణనిధి యని తమ్ముడు పొగడినాడు. తమ్ముని కుమారుడైన పారిజాతాపహరణకర్తయగు పింగరాజు

"రామపద భక్తియును శ్రీ
రామాయణ భాగవత పురాణములకథల్
నేమమున వ్రాసి చదివే
ధీమంతుని వెంకటక్షితీశ్వరు గొలుతున్."

అని కీర్తించియున్నాడు. అసమానప్రజ్ఞాధురంధరుడై పాండిత్యప్రకర్షగల వెంకట్రాజు స్వహస్తలిఖితమైన రామాయణ భాగవతాదులు ఇప్పటికి లభించియున్నవి. (ఆ కృతులు ప్రస్తుతం నావద్దనే ఉన్నవి అని తెల్పుకొనుచున్నాను) ధీమంతుడైన వెంకటరాజు తమ్ముడైన కృష్ణమరాజు నిగమాంతవేద్యుడు, అగణితగుణధుర్యుడునైన లక్ష్మణా చార్యుని శిష్యుడు. ఇతను "సీతాకల్యాణము" అను యక్షగానము రచించెను. ఈ కృతి మంచి ధారాశుద్ధికలిగి, మృదుమధురపదములతో నలరారుచున్నది. కృష్ణమ రాజుకు ఇద్దరు భార్యలు. పెద్దమాంబ, రంగాంబ అని వారిపేర్లు. పెద్దమాంబ వలన పుట్టిన కొడుకు పింగరాజు పారిజాతాపహరణ యక్షగానము రచించెను. ఇతని గురువులు వెంకటాచార్యుడు, సుందరదేశికుడు అను వారని తెలియుచున్నది. ఇతడు ఆంధ్రగీర్వాణభాషలందు మంచి పాండిత్యముకల్గి కవిరాజుగా వెలసియుండెను. ఇతని పారిజాతాపహరణము ద్రాక్షపాకములో అచ్చతెనుగు నుడికారపు సొంపులతో నలరారుచున్నది.

కృష్ణమరాజుకు రంగమాంబవలన పుట్టిన కొడుకు కుమారపెద్దిరాజు 'సావిత్రి' యక్షగానము రచించెను. కృష్ణమరాజు తన తండ్రిపేరు కుమారునకు పెట్టియుండును. పింగరాజు తన తాతగారైన కుమారపెద్దిరాజును స్తుతించెను.

"కృష్ణభూపాలు కీర్తివర్ధిష్ణుఁదలచి
మత్పితామహుఁడైన కుమారపెద్ది
రాజ సుకవిని మదిలోన పూజచేసి."

అని కీర్తించినందువలన తాతపేరు మనుమనికి ఉంచినట్లు తెలియుచున్నది.

కుమారపెద్దిరాజు "సావిత్రి" యక్షగానమున దంపతుల శీలధర్మములను చక్కగా వివరించి మంచిశైలిలో రచన సాగించెను.

తండ్రి - కుమారులైన ఈ కవిత్రయం వారి "సీతాకళ్యాణం, పారిజాతాపహరణం, సావిత్రి" అను మూడు యక్షగానములను "రాజపాళయం రాజకవుల యక్షగానములు" అను పేర ప్రకటింపబడుచున్నవి.

ఈ యక్షగానత్రయమును పరిశీలించినచో ఈ కవులు సంగీత సాహిత్యములందు ఆఱితేఱినవారనియు, ఆంధ్రగీర్వాణభాషలందు పాండిత్యము కలవారనియు విశదమగుచున్నడి.

వీరికాలమున నాయకరాజులు యక్షగానాదులు రచించి ఆంధ్రభాషకు ప్రోద్బలం చేకూర్చి సాహిత్యపోషణ గావించినారు కాబట్టి ఈ రాజకవులున్నూ సాహిత్యాభిరుచి కల్గినవారై యక్షగానములను రచించినారని తెలియుచున్నవి. వీరు వైష్ణవ సంప్రదాయమును అవలంబించినవారని విశదమగుచున్నది. వీరి యక్షగానములందు వీరి కాలముగుఱించిన విషయాలుగాని, వీరి ఊరు, దేశములను గుఱించిన విషయాలుకాని తెలియలేదు. కాని వీరి సమకాల సాహిత్యములనించియు, వీరి యక్షగానములందున్న కొన్ని సూచనలనుబట్టియు వీరి కాలనిర్ణయము, స్థలనిర్ణయము గావించవలసియున్నది.

ఈ కవులు 17 శతాబ్దమునకు తర్వాత నుండిరి యనుటకు సంశయములేదు. ఈ కాలముననే యక్షగానములు ఎక్కువగా రచింపబడినవి. ఈ కవుల యక్షగానములుండిన తాటాకు పుస్తకంలో ఇంకను నాల్గు యక్షగానములు చేరియుండినవి.

1. సుందరకాండ
2. నాంచారు పరిణయం
3. కూరత్తాళ్వారు చరిత్ర
4. సుగ్రీవ విజయం

ఇందు పై సుందరకాండ, సుగ్రీవవిజయం అచ్చయిన గ్రంథములు. నాంచారు పరిణయము, కూరత్తాళ్వారుచరిత్ర యక్షగానములు ఇకను ప్రచురింపవలసియున్నది.

త్వరలో ప్రచురింపబడును. ఇందు "నాంచారు పరిణయము" కర్త నందవరపు శేషాచలమంత్రి కాలనిర్ణయమునకు కొంత ఆధారా లున్నవి. కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావుగారు తమ "దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము" నందు, భాస్కర వేంకటాచలకవినిగుఱించి తెల్పియున్నారు. అందు, శ్రీ హరిసేతురామయ్యగారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక 7 వ సంపుటములో "చోళపాండ్య దేశాంధ్ర ప్రాబల్యము" అను వ్యాసములో భాస్కర వేంకటాచలకవినింగూర్చి తెల్పుచు క్రీ. శ. 1731 — 1767 ప్రాంతములనున్నట్లు అభిప్రాయపడినట్లు తెల్పియున్నారు.

ఈ భాస్కర వేంకటాచలకవి "సేతుమాహాత్మ్యము" రచించెను. ఇతని సోదరుడు శేషాచలకవి. ఈ శేషాచలకవి రచన "నాంచారు పరిణయము". నాంచారు పరిణయములో కవి తననుగూర్చి చెప్పికొన్నవి.

"వాసికెక్కిన నందవరకులమందు
భాసిల్లు ప్రఖ్యాతి పరగు భాస్కరుని
సూరయామాత్యుని సుతులిర్వు రందు
ఆరూఢిగను వేంకటాచలాగ్రజుడు
శేషాచలామాత్యసింహుడు యంధ్ర
భాషచే నాచ్చారు పరిణయం బొప్ప
యక్షగానము వేడ్క నెలమిరచించె
అక్షయమై పరగు అవనిలోపలను."

"నాంచారు పరిణయము" రాజకవుల యక్షగానములతో కలిపి ఒకేకట్టలోనే ఉన్నది. కాబట్టి ఇవి సమకాలీన యక్షగానములుగా నుండును. దీనింబట్టియు మన రాజకవుల కాలము 17 వ శతాబ్దపు తుదిలోనే 18 వ శతాబ్దపు ప్రారంభములోనో ఉండియుండుననుట నిశ్చయము.

ఇక వీరు ఆంధ్రదేశమున నున్నప్పుడే ఈ యక్షగానములు వ్రాసిరా? లేక రాజపాళయం నిర్మించిన తర్వాత వ్రాసిరా? అను అంశము చర్చింపవలసియున్నది. వీరికాలమున దక్షిణాంధ్రములోనే యక్షగానమును ఎక్కువగా ప్రచారమున ఉండినవి ఇంకను ఈ తాళపత్రగ్రంథప్రతి ఆంధ్రదేశములో లేదు.

యక్షగానములను గుఱించి అన్వేషించిన యస్వీ జోగారావుగారిని పదహారేండ్ల క్రితమే అడిగి ఈ యక్షగానములు ఇంతవరకు వారికి తెలియదని తెలుసుకొంటిని. నిడుదవోలు వేంకట్రావుగారి గ్రంథములందు కూడా వీరినిగుఱించిన ప్రస్తావనలేదు. ఆంధ్రదేశ కృతియైయుండిన వీరికి తెలిసియుండును. గావున ఇవి అముద్రితగ్రంథము అనుటలో సంశయంలేదు. అముద్రిత దక్షిణాంధ్ర వాఙ్మయ మనుట నిశ్చయం. ఇక ఈ రాజకవులు మధుర ప్రాంతమువారనుటయు నిర్ణయమైన విషయం. తమిళనాడులో రాజపాళయంలో మాత్రమే క్షత్రియ కవికులరాజులు ఉన్నారు. ఇప్పటికీ మా ఊరి గొట్టుముక్కలవారు. తమ పూర్వికులు కవులుగానుండిరని చెప్పుకొనుచున్నారు. ఇవిమాత్రమేగాక పారిజాతాపహరణ యక్షగానకర్త సింగరాజు,

"చారుమతిన్ నాంచారమ గొలుతున్"

అని రాజపాళయం ప్రక్కనున్న నాంచారమను స్తుతించెను.

ఇంకను షష్ఠ్యంతంలో,

"నీలాంబుద వక్షునకున్
నీలోత్పల కమలమిత్ర నేత్రయుగునకున్
పాలిత మునిజాలునకున్
పాళెము శ్రీరామునకును పరమాత్మునకున్"

అని నుడివెను. ఇందు 'పాళెము' అనునది రాజపాళయమేకాని వేఱులేదు. గావునే వీరందఱు రాజపాళయం నివాసులుగానుండియే ఈ కృతులు రచించిరి అని నిర్ణయించ గలము.

వీరిలో సింగరాజుపేర 'సింగరాజు కోట' అని ఒకప్రాంతం ఉండుటయు గమనార్హము. ఇంకను వేంకట్రాజు స్వహస్తలిఖిత రామాయణ భారతాదులు రాజపాళయమందే ఉన్నవి. ఇదియు ఈ నిర్ణయమును బలపరచుచున్నవి. గాబట్టి ఈ ముగ్గురు కవులు రాజపాళయం రాజకవులే అనుట నిశ్చయం.

1955 లో పూసపాటి కుమారస్వామిరాజాగారు (మద్రాసు రాష్ట్ర ముఖ్య మంత్రిగను, ఒరిసా గవర్నరుగాను ఉండిరి.) గాంధి కళామంద్రమును రాజపాళయ

ములో స్థాపించినారు. ఈ సాంస్కృతిక కేంద్రము ఇప్పుడు తేజోమయముగా విరాజిల్లుచున్నది. ఇందు ఒక పెద్ద గ్రంథాలయమున్నది. ఆంధ్ర ఆంగ్ల తమిళ భాషలందు వేనవేలు పుస్తకములున్నవి. శ్రీ కుమారస్వామిరాజాగారు కీర్తిశేషులైన తర్వాత వారి సహచరులు, జడ్జిగానుండి విరమించినవారునగు శ్రీ ఎట్టుగుంటల వెంకట్రాజుగారు గాంధికళామంద్రమును అభివృద్ధికి తెచ్చిరి. శ్రీ కుమారస్వామి రాజాగా రుపయోగించిన వస్తుప్రదర్శనము కళామంద్రములో నుంచిరి. అందు రెండు తాళపత్రగ్రంథము లుండినది. అందొక్కటి రాజపాళయం రాజకవులు యక్షగానము లున్న తాళపత్ర గ్రంథము. 1960 లో దాన్ని నేను మొట్టమొదట చూచితిని.

ప్రస్తుతము హైదరాబాదులో నివసిస్తున్న సుప్రసిద్ధ హిందీపండితులు, భాషా సేవాతత్పరులునైన శ్రీ S. V. శివరామశర్మగారు ఈ తాళపత్ర గ్రంథములను గురించి 'ఆంధ్రపత్రిక' లో అంతకుపూర్వమే తెల్పియుండిరి. శ్రీ సాధు వరదరాజం పంతులు గారు నాకు సుపరిచితులైయుండిరి గాన వారూ నాకు ఈ విషయం తెలిపియుండిరి. కాని అప్పుడు నేను ఇరవైయేళ్ళ యువకుడను కాబట్టి ఆ గ్రంథములు ఎక్కడ ఉన్నవో ఏమో అని ఊరకున్నా ఆ గ్రంథాలను చూడాలను అకాంక్షతో నువ్విళ్ళూరుచుంటిని. అట్టి నాకు శ్రీ వెంకట్రాజుగారు తాళపత్ర గ్రంథం చూపగనే చాలా సంతోషించితిని. దాన్ని ఎప్పటికైనా ప్రకటించాలనుకొంటిని దానికి పదేళ్ళ తర్వాత గొట్టుముక్కలవారి పురోహితుడైన శ్రీ సహాయం అయ్యరు తనవద్ద కొన్ని తాటాకు పుస్తకాలున్నట్లు తెల్పి నాచేతికి అవి ఇచ్చినారు. అవి శ్రీ గొట్టుముక్కల వెంకట్రాజు స్వహస్తలిఖిత భారత భాగవతములుగా నుండినవి. ఇవి ప్రకటనలైన గ్రంథాలే గావున వానిని భద్రపరచి యుంచినాను. రాజకవుల యక్షగానములను మాత్రం ప్రచురింపవలయునని దృఢసంకల్పము చేసుకొంటిని.

ఏయొక్క కార్యమూ పరిపక్వదశలోనే ఫలించుననుటకు తగినట్లు ఐదేండ్ల క్రితం సుప్రసిద్ధ విమర్శకులు, పండితవతంసులునైన మధురై కామరాజర్ యూని వర్సిటి తెలుగు శాఖాధ్యక్షులు డా. శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు మా తెల్గు విద్యాలయం ఉగాది ఉత్సవమునకు వచ్చినారు. అప్పుడు నేనూ, శ్రీ కోదండరామయ్యా గారూ కలసి, సుప్రసిద్ధ ఇండస్ట్రియలిస్ట్, సుగుణశీలియగు శ్రీ పూసపాటి రామసుబ్ర హ్మణ్యరాజుగారిని సందర్శించి మాట్లాడుచుండగా నేను గాంధికళామంద్రములో నున్న యక్షగాన తాటాకుపుస్తకమును శ్రీ కోదండరామయ్యగారి చేతి కివ్వవలసినదనియు,

వారు శుద్ధప్రతి తయారుచేయగలరనియు తెల్పినాను. శ్రీ రాజుగారు సంతోషముతో నంగీకరించిరి. శ్రీ కోదండరామయ్యగారూ నా ప్రార్థన నంగీకరించి అచిరకాలంలోనే శుద్ధప్రతి తయారుచేసి ఇచ్చినారు.

ఐదారేండ్లుగా సాహిత్యరంగంలో వివిధకార్యకలాపములందు నిమగ్నుడనైన నాకు తీరికలేక యుండిపోతిని. ఆంధ్రప్రదేశ గవర్నమెంటువారు ప్రపంచ తెలుగు సంస్థద్వారా మా తెలుగు విద్యాలయమునకు, ఆదరణచూపి ధనసహాయం చేసియుండిరి. గావున ఈ సంవత్సరము ఈ తాళపత్ర గ్రంథ ప్రకటనకు ధనసహాయం ఇవ్వవలసినదిగా కోరినాను. వారు అంగీకరించి రెండువేల రూపాయలు మంజూరు చేసినారు. ఆ తర్వాత మాఊరి రాజుల పొదుపు నిధులందు కొంత ధనసహాయం లభించినది. ఈ ఆదరణవల్లనూ, శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారి భాషాసేవాతత్పరత వల్లనూ, ఈ "రాజపాళయం రాజకవుల యక్షగానములు" మా తెలుగు విద్యాలయం తరపున ప్రచురింప గల్గినందులకు సంతోషించుచున్నాను.

ఈ గ్రంథ ప్రచురణకు, సహకరించిన, పురికొల్పిన మిత్రులు మా తెలుగు విద్యాలయ కార్యకర్తలకూ, ఆంధ్రప్రదేశ్‌లో నాకు నండదండగానున్న హైదరాబాదు క్షత్రియసేవాసమితి, అధ్యక్షులు శ్రీ G. సోమరాజుగారు, కార్యదర్శి శ్రీ M. నారాయణ రాజు, శ్రీ D. V. S. రాజుగారు (హైదరాబాదు), భారతఫిలిం ఫెడరేషన్ అధ్యక్షులు శ్రీ D. V. S. రాజు (మద్రాసు), శ్రీ న. రామభద్రరాజు (అమలాపురం), శ్రీ త్యాగమూర్తియగు కీర్తిమిగులు శ్రీ చింతలపాటి వరప్రసాద మూర్తిరాజుగారు M. A. మొదలగు పెద్దలకూ నా కృతజ్ఞతాభివందనాలు తెల్పుకొంటాను. ఈ కృతిని చక్కగా ముద్రించిఇచ్చిన శ్రీ వేదం వేంకట్రాయశాస్త్రి M. A., గారి మేలు మఱవలేను. వారికి కృతజ్ఞతాభివందనాలు తెల్పుకొంటాను.

రాజపాళయం,
1.1.81.

ముదునూరి జగన్నాథరాజా

# పీఠిక

ఇది యొక యక్షగానముల సంకలనము. ఇందు మూడు యక్షగానములు కలవు. అవి సీతాకల్యాణము, పారిజాతాపహరణము, సావిత్రి చరిత్రము. ఇవి మూడును రాజకవులు రచించినవి. వారు ఒకే వంశమునకు చెందినవారు. గొట్టుముక్కల అను గృహనామము కల క్షత్రియ వంశ మది. వారి యభిజనము కూడ ఒకటే అని తోఁచును. అది సార్థక నామధేయము కల రాజపాళయము; ప్రస్తుతము తమిళనాడు రాష్ట్రములోని రామనాధపురము మండలమున నున్నది. కనుక ఈ సంకలనములోని యక్షగానములు ఒకేకుదురునందలి ఒకచెట్టున పూచిన పూవులు.

ఈ సంకలనమునకు "రాజపాళయం రాజకవుల యక్షగానములు" అని పేరు పెట్టబడినది. రాజకవు లనగా రాజులై రాజ్యపరిపాలనము గావించుచు కవిత్వము చెప్పిన కవు లనుట మన కనుభవములో నున్న విషయము. కాఁగా ఈ యక్షగానములను రచించిన కవు లెట్లు రాజులో, యే రాజ్యములు పాలించిరో మనకు తెలియరాదు, కాని యీ కవుల వంశమునకు చెందినవారు వరదనృపతి [పు. 4], వరదభూపాలుడు, వెంకటాధిపుడు [పు. 52], కృష్ణనృపతి [పు. 5౦], కృష్ణభూవరుడు [పు. 100], గొట్టుముక్కల సింహాసనస్థుడు [పు. 105], కుమారపెద్దనృపతి [పు. 128] ఇత్యాదిగా పేర్కొనఁబడుటచే వారు రాజ్యము నేలిన రాజులనియే యనుమానింపఁ దగియున్నది. కాని వా రేలినవి రాజ్యములో, రాజ్యభాగములో ఎట్టివో మనకు తెలియరాదు. రాజకవు లనుటకు మఱొక విధముగా కూడా మన మర్థము చెప్పుకొనవచ్చును. రాజవంశ్యు లయిన, క్షత్రియవంశ్యులయిన కవులని యీ యర్థము. ఇందలి యక్షగానములను రచించిన ముప్వురు కవులును నట్టి యర్థములో రాజకవు లగుట యథార్థము. అం దసత్య మావంతయు లేదు. గొట్టుముక్కలవారు క్షత్రియ వంశ్యులు. చంద్రవంశ క్షత్రియులు. [చూ. పంకజాహిత వంశ పావనోత్తముఁడు పు. 52, స్థిరచంద్రవంశ విస్తీర్ణకరుండు పు. 105] ధనంజయగోత్రులు. ఇట్లు వీరు ముప్వురును రాజవంశ్యు లయిన కవు లనుట రూఢి యగుచున్నది. వీరి ముప్వురి యభిజనమును రాజపాళయ

మనుట ప్రకాశకుల గట్టి విశ్వాసముగా తోఁచును. అట్లు వారు విశ్వసించుటకు కారణము లీ క్రిందివిగా తోఁచును.

1. ఈ యక్షగానములలో నొకటి యగు పారిజాతాపహరణములోని షష్ఠ్యంత ములలో కృతిపతి యగు శ్రీరామచంద్రుడు "పాళెము శ్రీరామునకును" [పు. 60] అని ప్రస్తావింపఁబడెను. అందలి పాళెము అను పదము రాజుల పాళెమయిన రాజపాళయము నం దానాఁడు వెలసియుండిన రామాలయములోని శ్రీరామచంద్ర మూర్తికి ఆ యక్షగాన మంకితము చేయఁబడెనని దాని యర్థముగా మనము గ్రహింప వలసి యుండును.

2. రాజపాళయము నందు నేఁడును గొట్టుముక్కల వంశమునకుఁ జెందిన రాజవంశ్యులు కలరు. వారు సాహిత్యాదికళలలో నాసక్త్యభినివేశములను కలిగి యున్నారు. ఈ యక్షగానములను రచించిన కవులు వీరికి పూర్వు లనుట సంభావ్యము. ఇవి నిష్కర్షగా నిర్ధార్యములైన కారణములుగా గ్రహించుటలో తప్పులేదు. ఇట్లుకాక దీనిని మఱొక విధముగా కూడ సమర్థింపఁదగును. ఈ మూఁడు యక్షగానములును మఱిరెండు యక్షగానములతోఁబాటు లిఖింపఁబడిన యొకే తాళపత్ర గ్రంథము రాజపాళయమునందు చిరకాలముగా భద్రపఱుపబడి యుండినది లభించుట. అపుడు రాజపాళయమునందు లభించిన రాజకవుల యక్షగానములని మనము గ్రహింపవలసి యున్నది.

ఈ సంకలనములోని మూఁడు యక్షగానములును చిత్రముగా కొంత సంబంధము కలిగియున్నట్లు తోఁచును. ఇందలి తొలి యక్షగానము సీతాకల్యాణము. అది రామాయణమునకు సంబంధించినది. రెండవది పారిజాతాపహరణము. అది భాగవతమునకు సంబంధించినది. మూఁడవది సావిత్రి చరిత్రము. అది మహాభారతము నకు సంబంధించినది. ఇట్లిందలి మూఁడు యక్షగానములును భారతీయులకు పరమ పూజ్యము లయిన రామాయణ, మహాభారత, మహాభాగవతములకు సంబంధించి యుండుట యాదృచ్ఛికమే యయినను నానందింపదగిన యొక యంశము. ఈ కవుల వంశ్యులలో నొకడగు వెంకటరాజును గూర్చి పారిజాతాపహరణ యక్షగానము నం దిట్లు కలదు.

కం. "రామపదభక్తియును శ్రీ
రామాయణభాగవత పురాణములకథల్
సీమమున వ్రాసి చదివే
ధీమంతుని వెంకటక్షితీశ్వరుఁ గొలుతున్." [పు. 58]

ఈ వెంకటక్షితీశ్వరుని వలెనే యావంశమునందలి యితరులును రామాయణ, భారత, భాగవతములయెడ పూజ్యభావము కలిగియుందు రనుటలో సందేహము లేదు. అట్టి పూజ్యభావమే పరస్పర పూర్వకముగా నీ యక్షగానములను మూఁడింటిని వరుసగా రామాయణ, భారత, భాగవత సంబంధులుగా రచించుటకు కవులకు ప్రేరకమయియుండ నోపును.

ఈ యక్షగానములందు మఱొక సమానధర్మము కూడ నున్నది. అది యీ మూఁడును శ్రీరామచంద్రునికే యంకితము చేయఁబడి యుండుట.

సీతాకల్యాణమునందు పరమేశ్వరుడు స్వప్నమున సాక్షాత్కరించి "పంకజాక్షుఁడు రామభద్రునిపేర నంకితంబుగఁ జేయమని యానతిచ్చి" [పు. 5] యంతర్హితుఁ డయ్యేనట. పారిజాతాపహరణమున సత్యాకృష్ణులు కవికి స్వప్నమున దర్శనమొసగి "పారిజాతాపహరణ యక్షగానంబు సీతారామాంకితంబు గావింపుమని" [పు. 59] చెప్పి యంతర్హితులయిరట. సావిత్రి చరిత్రమును "శ్రీకాకుత్స్థకులాబ్ధి చంద్రుఁడగు నా శ్రీరాముపేరన్ సుధాపాకం బొప్ప రచించితిన్" [పు. 128] అని కవి కంఠోక్తిగా చెప్పినాడు. ఇట్లీ మూఁడును శ్రీరామచంద్రునకు అంకితము చేయఁబడియుండుట గమనార్హము.

మఱియొక సమానధర్మము కూడ మన కిందు గోచరించును. మూడు యక్షగానము లందలి కృత్యాది నాందీపద్యములు శ్రీరామచంద్రుని స్తుతించునవియయి యుండుట.

"దయాభావున్ రాముఁ గకుత్స్థవల్లభు మదిన్ భావింతు నశ్రాంతమున్" పు. 1 అని సీతాకల్యాణమునను, "కౌసల్యాత్మజుఁ డయినరాముఁ డొసఁగున్ కల్యాణసాకల్యముల్" పు. 67 అని పారిజాతాపహరణమునను, ... ... ... "పేరాసన్ దప్పకచూచు రాముఁ డొసగున్ యత్యర్థ ఇష్టార్థముల్" పు. 105 అని సావిత్రి చరిత్రమునను కృత్యాది పద్యములు రామస్తుత్యాత్మకములుగా నున్నవి.

ఈ యక్షగానముల సంకలనములో తొలిది సీతాకల్యాణము. దానిని ధనంజయ గోత్రుఁడైన గొట్టుముక్కల కృష్ణమరాజు రచించెను. అతడు గొట్టుముక్కల వరదరాజునకు, వెంకటాంబకు జనించిన కుమారుడు. గొట్టుముక్కల వెంకటరాజునకు తమ్ముడు. ఈ సంకలనములోనిదే యగు పారిజాతాపహరణమున "రామాయణ, భాగవతపురాణకథలను నియమముతో వ్రాసి చదివెడు ధీమంతుడు" గ పేర్కొనఁ బడిన వెంకటక్షితీశ్వరుడు ఇతడగు నేమో తెలియదు. పగళాతము లక్ష్మణాచార్యులను నతడు గొట్టుముక్కల కృష్ణమరాజునకు గురువు. అతడు నిగమాంతవేద్యుడుగ, జగదభినుతకీర్తిహారుడుగ, అగణితగుణధుర్యుడుగ పేర్కొనఁబడెను. ఇతడు తన "సీతాకల్యాణము"ను స్వప్నమున తనకు దర్శనమిచ్చిన పరమేశ్వరుని యానతిపై శ్రీరామచంద్రున కంకితము గావించెను. తాను రామాయణ మహాకావ్యమునకు సంబంధించిన సీతాకల్యాణమును యక్షగానముగా రచించుచుండియుఁ బూర్వ కవిస్తుతిలో తొలుత వ్యాసులవారికి మ్రొక్కుటయు, "వ్యాసమునివరకరుణ కవితా వాగ్విలాసము మెఱయువాఁడను" అని తన్నుగూర్చి పేర్కొనుటయు,

> "ఇట్టిభాగ్యము గల్గె నెట్టిపుణ్యంబొ,
> ఘట్టిగావ్యాసుల కరుణనా కనుచు"

పేర్కొనుటయు, ఇతనికి వ్యాసభగవానునిపట్లఁ గల మ్రొగ్గును సూచించుచున్నవి.

"పారిజాతాపహరణము" ఇందు సంకలింపఁబడిన రెండవ యక్షగానము. దానిని ధనంజయగోత్రుఁడే అయిన గొట్టుముక్కల సింగరాజకవి యను నతడు రచించెను. అతడు గొట్టుముక్కల కృష్ణమరాజునకును, పెద్దమాంబకును కుమారుడు. ఈ కృష్ణమరాజు సీతాకల్యాణ యక్షగానమును రచించిన గొట్టుముక్కల కృష్ణమ రాజుగా తోపడు. అతడు ఆ వంశమున తరువాతి తరములకు చెందిన ఒక కృష్ణమ రాజుగా తోచుచున్నాడు. ఇతడు తన యక్షగానమందు కావించిన పూర్వ కవిస్తుతిలో కృష్ణభూపాలునియొక్కయు, కుమారపెద్దిరాజ కవియొక్కయు ప్రశంస కలదు. ఈ కుమారపెద్దిరాజకవి పారిజాతాపహరణ యక్షగానకర్తయగు సింగరాజకవికి పితామహుఁడని తెలియుచున్నది. ఇందలి మూడవ యక్షగానమగు "సావిత్రి చరిత్రము" నకు కర్త బహుశః ఈ కుమారపెద్దిరాజకవియే కాఁదగును. కనుక ఈ సింగరాజకవి సీతాకల్యాణకర్తయగు గొట్టుముక్కల కృష్ణమరాజునకును, సావిత్రి చరిత్ర యక్షగాన

కర్త యగు కుమారపెద్దిరాజకవికిని స్పష్టముగ తరువాతివాఁడని తెలియుచున్నది. దీనిని బట్టి ఈ యక్షగాన కవులకుఁ గల బాంధవ్యక్రమ మిట్లు తెలును.

గొట్టుముక్కల వరదరాజు
[భార్య వెంకటాంబ]

గొట్టుముక్కల వెంకటరాజు

గొట్టుముక్కల కృష్ణమరాజు
[సీతాకల్యాణకర్త]
[భార్య రంగాంబ]

గొట్టుముక్కల కుమారపెద్దిరాజు
[సావిత్రి చరిత్ర కర్త]

గొట్టుముక్కల కృష్ణమరాజు
[భార్య పెద్దమాంబ]

గొట్టుముక్కల సింగరాజకవి
[పారిజాతాపహరణకర్త]

కాలక్రమమునుబట్టియు, రచనాకాలమునుబట్టియు, చూడగా నిందు సంకలింపఁబడిన యక్షగానముల వరుసక్రమము ఇట్లుండఁదగును.

1. సీతాకల్యాణము, 2. సావిత్రి చరిత్రము, 3. పారిజాతాపహరణము. కాని కవితాప్రాశస్త్యము దృష్టినో లేక మరేకారణముచేతనో యీ క్రమ మిందు మార్పబడినది. పరాశరభట్టరు అన్వయమునకు చెందిన వెంకటాచార్యులు అను నతడు గొట్టుముక్కల సింగరాజకవికి గురువు. ఇతడు [సింగరాజకవి] గొప్ప విష్ణుభక్తుడు, సమరార్జునుడునట. ఇష్టదేవతాస్తుతిలో లక్ష్మీదేవితోబాటు "నాచ్చారమ్మ"ను కూడ స్తుతించియుండుట అందులకు నిదర్శనము. దీని రచనాకాలము స్థూలముగా "సప్తమీ భానువాసరము" [59 పు.] అని తెలుపఁబడినది. ఇది సూటిగా నే తేదికి సరియగునో గుణించి తెలిసికొనవలసియున్నది. దీని నీ కవి తనకు స్వప్నమునందు ప్రత్యక్షమైన సత్యాకృష్ణుల యాదేశముమేరకు సీతారామాంకితము గావించెను. ఇందలి షష్ఠ్యంత

ములలోనే ఈతడు తన కృతిపతి యగు శ్రీరామచంద్రుని "పాళెము శ్రీరాముఁడు" [పు. 60] గా పేర్కొనెను. వీరి గృహనామము "గొట్టుముక్కల" అని కాక "గొట్టుముక్కుల" అనుటకు ఇందే యొక యాధారము గలదు. "కొమరప్ప గొట్టుముక్కుల కులోన్నతుఁడు" [పు. 100]. ఇందు యతిస్థానమున "గొట్టు ముక్కుల" అని నిర్ద్వంద్వముగ ప్రయోగింపబడియున్నది. ఈ పారిజాతాపహరణము సుప్రసిద్ధుడగు ముక్కుతిమ్మన రచితమగు "పారిజాతాపహరణ" కావ్యమునకు యక్షగానరూపము.

"గరిమను పింగరా ట్కవిశేఖరుండు
శ్రావ్యమై తగు పారిజాతాపహరణ
కావ్యంబు ఇల యక్షగానంబుగాను
రచియించె చంద్రతారార్క మై మిగుల." [పు. 100]

అని యీ విషయము ఇందే కంఠోక్తిగా తెలుపబడియున్నది. అట్లు తెలుపుటమాత్రమే కాక యీ కవి తన యక్షగానమునందంతట నా కావ్యమునే యనుసరించియుండుట కాననగును. కథాక్రమము, సన్నివేశములు, కొండొకచో కొన్ని వర్ణనలు పారిజాతాప హరణ కావ్యమునే యంతట ననుసరించియుండుటను నిరూపించును. అందలి కొన్ని పద్యములకు ఛాయలుకూడ నిందు కలవు.

సావిత్రి చరిత్రము ఈ సంకలనములో చేర్పఁబడిన మూడవ యక్షగానము. కవి కాలమును బట్టియు, రచనాకాలమును బట్టియు నిది సీతాకల్యాణమునకు తరువాతి దియు, పారిజాతాపహరణమునకు పూర్వపుదియు నగు రచనము కావలెను. ధనంజయ గోత్రుడయిన గొట్టుముక్కల [కుమార] పెద్దిరాజకవి దీనికి కర్త. ఇతడు సంగీత సాహిత్య సద్గుణాలయుడును, ఇంగితజ్ఞుడును, జనహితగుణోన్నతుడును, రసికుడును అగు గొట్టుముక్కల కృష్ణమరాజునకును, రంగాంబకును సుతుఁడు. సరస వాగ్వి లాసుఁడు. ఇతని యితరబంధువులనుగూర్చిన వివరములు — ఆ భాగమున గ్రంథ పాతము లుండుటచే — స్పష్టముగా తెలియవచ్చుటలేదు. ఈ యక్షగానము కూడ నిందలి తక్కిన యక్షగానముల వలెనే కాకుత్థ్సరామాంకితము చేయఁబడినది. ఇందు కృతిపతియగు రామునికి "కాకుత్థ్స" యను విశేషణ మొకటి యదనముగా చేర్పబడి యున్నది.

చూ. "రమణతో కాకుత్థ్సరామాంకితముగ
అమరించు నీ కథ కాది యెట్లనిన." [పు. 106]

"శ్రీకాకుత్థ్సకులాబ్ధిచంద్రుఁ డగునాశ్రీరాముపేరఁగా." [పు. 128]

శ్రీరామచంద్రుని కాకుత్థ్సరామునిగ పేర్కొనుటలో నీ కవికి ముచ్చట హెచ్చు. ఈ యక్షగానము నీ కవి "సుధాపాకం బొప్ప రచించితి" నని చెప్పికొనినను, నిందలి కవిత దానికి సమర్థకముగా లేదు. తక్కిన రెండు యక్షగానములతోఁ బోల్చి చూచినపు డిందలి కవిత యంత ప్రశస్తమయినదిగా తోఁపదు. భారతములోని అరణ్య పర్వమునందలి సావిత్ర్యుపాఖ్యానమునకును, నీ సావిత్రి చరిత్రమునకును కొన్ని వివరములలో భేదము చూపట్టును. సావిత్రి తండ్రి మద్రదేశాధిపతి యగు అశ్వపతి యని భారతమునందు కలదు. ఇందు మద్రదేశమునకు రాజధాని మణిపురి. దానిని లక్షణభద్రు డను రా జేలుచుండెను. అతని భార్య మాళవి. ఇందు మణిపురి లక్షణ భద్రు డనుపేర్లు కల్పితములుగా తోచును. అట్లే సత్యవంతుని తల్లిదండ్రుల పేళ్లు ఈ యక్షగానమునందు తెలుపఁబడలేదు. ఊరక వృద్ధదంపతులు అని మాత్రము నిర్దేశింపబడినది.

తెలుగు సాహిత్యములో యక్షగానము ఒక విశిష్ట సాహిత్యప్రక్రియ. దాని స్వరూప లక్షణములను గుఱించియు, ఆ జాతికి చెందిన సాహిత్యమును గూర్చియు, ఇదివఱకే పెక్కు పరిశోధనలు జరిగినవి. ఈ ప్రక్రియయొక్క యారంభ మెచ్చట జరిగినను నది తామరతంపరగా నభివృద్ధి జెందుట మాత్రము దక్షిణాంధ్రయుగము నందే యనుట సాహిత్యపరు లెల్లరకు తెలసినవిషయము. నాయకరాజులు దక్షిణ దేశము నేలిన కాలములో — ముఖ్యముగా మధుర తంజావూరు నాయకరాజుల పరిపాలనకాలమున — తెలుగునం దనేక యక్షగానములు రచింపబడినవి. వీరి సమ కాలమునందే యీ యక్షగాన రచనముల ప్రభావముచే సోదరభాష లగు తమిళము నందును, కన్నడమునందును యక్షగానములు రచింపబడె ననుట గమనింపదగి యున్నది. తమిళమునందును, తెలుగునందును నీ యక్షగానములు తరువాతికాలమున నంతగా సమాదరింపఁబడక పోయినను కన్నడమునందు మాత్రము నివి నేటికిని బహుళ ప్రచారమునందున్నవి. కన్నడదేశమునందు పెక్కుతావులలో నీ యక్షగాన ములు ప్రదర్శితము లగుచుండుట నేడును మనము చూడఁగలము.

ఈ సంకలనమునందు చేర్పబడిన యక్షగానములు యక్షగాన లక్షణ లక్షితములై యొప్పారుచుండుట మనకు మిక్కిలి ముదముగొల్పును. యక్షగానము దేశిసాహిత్యమునకు చెందిన ఒక ప్రక్రియ యని అభిజ్ఞుల అభిప్రాయము. సంగీత సాహిత్యముల సమ్మేళనరూపమైన యక్షగానమునందు మాత్రాచ్ఛందోఘటితములగు దేశిరచనములు సంగీతప్రధానములుగ రచింపఁబడును. ఈ సంకలనమునందలి యక్షగానములయందును నట్టి దేశిరచనములు పెక్కు కలవు. వానికి సంబంధించిన వివరములను ఈ క్రింది పట్టికలో కాంచనగును.

## దే శి ర చ న ల ప ట్టి క

| పేరు | సీతా.క | పారి | సావిత్రి |
|---|---|---|---|
| అటతాళం | 14 | 9 | 4 |
| అటతాళం రేకులు | — | 2 | 1 |
| అర్ధచంద్రికలు | 6 | 9 | 4 |
| ఆదితాళం | — | — | 1 |
| ఏకతాళి | 3 | — | 3 |
| ఏకతాళి రేకులు | — | 8 | — |
| జంపె | 23 | 21 | 11 |
| జంపె రేకులు | 1 | — | — |
| త్రిపుట/త్రిపుద | 30 | 6 | 8 |
| దరువు/దర్వు | — | 5 | — |
| ధవళం | 1 | 1 | — |
| మంగళం | 1 | 1 | — |
| యాలలు | 1 | 1 | — |
| రూపకం | — | 2 | 6 |
| రూపక రేకులు | — | — | 1 |
| శోభనం | 1 | 1 | — |
| సువ్వాల | 1 | — | — |
| — టంక | — | — | 1 |

# ప ద్య ము ల  ప ట్టి క

| పేరు | సీతా.క | పారి | సావిత్రి |
|---|---|---|---|
| కందం | 4 | 11 | 2 |
| గీతం | 7 | 10 | 2 |
| శార్దూలం | 1 | 1 | 3 |
| సీసం | 1 | 3 | — |
| (సంధి) వచనం | 86 | 53 | 29 |
| ఉత్పలమాల | — | 1 | — |

ఈ పట్టికను పరిశీలింపగా సీతాకల్యాణమునందు త్రిపుట ప్రథమస్థానమును, జంపె ద్వితీయస్థానమును నాక్రమించును. పారిజాతాపహరణమునందును, సావిత్రి చరిత్రము నందును జంపెకే ప్రాధాన్యము. సీతాకల్యాణమునందును, పారిజాతాపహరణము నందును యాలలు, ధవళము, శోభనము, మంగళము, దండకము అను రచనలు కలవు. సావిత్రి చరిత్రమున నివి లేవు. సీతాకల్యాణమునందు కానవచ్చు సువ్వాల తక్కిన రెంటియందును లేదు. పారిజాతాపహరణమునందును, సావిత్రి చరిత్రము నందును రూపక రచనలు కలవు. దరువు ఒక పారిజాతాపహరణమునందే కలదు. వీనియం దింకను గల మఱికొన్ని విశేషములను పట్టికలో చూచి తెలిసికొనవచ్చును.

ఈ యక్షగానముల రచనాకాలమునుగూర్చి తెలిసికొనదగిన యాధారములు మన కిందు కానరావు. పారిజాతాపహరణ యక్షగానమునందు మాత్రము కవియగు గొట్టుముక్కల సింగరాజకవికి సప్తమీ భానువాసరమున పు. 56] స్వప్నము వచ్చినట్లు తెలుపఁబడినది. ఇతర వివరము లొసగబడక పోవుటచే నది యే తేదికి సరిపడునో నిర్ధరించి తెలుపుటకు వీలు కాకున్నది. ఈ పారిజాతాపహరణ యక్షగానము ముక్కు తిమ్మన విరచితమగు పారిజాతాపహరణ కావ్యము ననుసరించి వ్రాయఁబడినట్లు కంఠోక్తిగా చెప్పబడియుండుటచే నిది పారిజాతాపహరణ కావ్యము రచింపబడిన తరువాత, నది బాగుగా ప్రసిద్ధిలోనికి వచ్చిన పిదప రచింపబడినదిగా తోచును.

పారిజాతాపహరణ యక్షగానమునందు ఒకచో నిట్లు కలదు.

"అంగజాగ్ని యుప్పొంగి పొంగలో పొంగలి
పొంగలి యంచును పొలఁతులు నవ్వగు." [పు. 71]

ఇది చేమకూర వెంకటకవి విరచితమగు విజయవిలాసమునందలి యీ క్రిఁది పద్యము నకు అనుకరణముగా తోఁచును.

ఉ. "అంగన గుబ్బ చన్మెఱుఁగు
టందపుమేలి పసిండి కుండలన్
బొంగఁ దొడంగె జొబ్బిలఁగఁ
బూసిన గంధము తాపవహ్ని సం
పంగి కటారి వీరునకుఁ
బాలును బియ్యములేని పొంగలో
పొంగలి యంచు నయ్యలరుఁ
బోణులు సారెకు గేలిసేయఁగన్." [3. ఆ. 41. ప.]

చేమకూర వేంకటకవి తంజావూరు రఘునాథనాయకుని యాస్థానమునందుండి యతనికి కృతి నిచ్చినవాడగుటచే నతడు క్రీ. శ. పదునేడవ శతాబ్దికి చెందినవా డగుచున్నాడు. అతని విజయవిలాసమునందలి యొక పద్యమునకు అనుకరణమైన రచనము కల యీ యక్షగానము ప్రాయికముగా నది ప్రసిద్ధిలోనికి వచ్చినపిదప, క్రీ. శ. పదునెనిమిదవ శతాబ్దిలో రచింపబడి యుండునని యూహింపదగును. దీనికి పూర్వరచనము లగు తక్కిన రెండు యక్షగానములును క్రీ. శ. పదునేడవశతాబ్ది యుత్తరార్ధమునందు రచింపబడుట సంభావ్యము. కనుక నీ మూడు యక్షగానములును దక్షిణదేశమున యక్షగానములు ముమ్మరముగా రచింపబడుచుండిన కాలములో — అనగా క్రీ. శ. పదునేడు, పదునెనిమిది శతాబ్దములలో రచింపబడియుండవచ్చునని తోచును.

ఈ కవులకు గల స్థానికాభిమాన మిందలి కొన్ని వర్ణనముల మూలమున వెల్లడియగును. ఈ క్రింది పాదములలోని తిల్లగోవిందుని ప్రస్తావము గూడ ఇట్టిదే. శ్రీకృష్ణు డిట తిల్లగోవిందుడుగా పేర్కొనబడెను.

"ఉన్నయానగరెల్ల నొగిపరికించి
తిల్లగోవిందుడా తీరెల్లగాంచె." [పారి. పు. 70]

శ్రీకృష్ణుడు సత్యభామ యంతఃపురమును ప్రవేశించిన సందర్భమున —

"యాలకిలతల నయ్యాట లూగగఁ జాల
పూలతోటల నేల ప్రోదించ రేల." [పారి. పు. 71]

ముక్కుతిమ్మన పారిజాతాపహరణమునం దీ సందర్భమున నిది కానరాదు. అట్లే సత్యాకృష్ణులు స్వర్గలోకమునందలి నందనారామమున విహరించిన సందర్భమునందు పారిజాతాపహరణ యక్షగానమున నిట్లు కలదు —

సహకార పల్లవోత్సవలీలచేత
గ్రహియించి బిగియార కౌగిటఁజేర్చి
పెనఁకువ చౌశీతి భేదబంధముల
గొనకొని పెనగొన్న కొమ్మలో యనఁగ
యాలకిలతలు వో యలనాగ కంటె.

* * * *

పీకుచంబుల కోడి నిష్ఠురవృత్తి
ప్రాకటోర్ధ్వముగ తపంబు కావించి
తలక్రిందుగాఁ వ్రేలి తపమున నుండు
చెలువున ఎళనీర్లు చెలఁగెను కంటె. [పారి. పు. 87]

ఈ సందర్భమున పారిజాతాపహరణ కావ్యమునం దిట్లు లేదు. ఇట ఏలకితీగలను, ఎలనీటి బొండములను వర్ణన వ్యాజమున ప్రస్తావించుట కవికి గల స్థానికాభిమానమును వెల్లడించును. కవి యభిజనమగు రాజపాళయము పరిసరములలో నేలకితీగలును, కొబ్బరిచెట్లును విశేషము.

ఈ యక్షగానములలో సీతాకల్యాణమునందును, పారిజాతాపహరణమునందును చక్కని కవిత కానవచ్చును. అందలి కొన్నివర్ణనలు ప్రబంధవర్ణనలను తలఁపించును.

పురవర్ణన [సీతా. అ, 26 పు.], గర్భచిహ్నములు [సీతా. 11 పు.], నదీవర్ణన [గంగానది. సీతా. 22 పు.], దశావతారములు [సీతా. 23 పు.], సూర్యాస్తమయ వర్ణన [సీతా. 29 పు.], సూర్యోదయ వర్ణన [సీతా. 33 పు.], మేలుకొలుపు [పారి. పు. 80], ఉద్యాన వర్ణన [పారి. 87 పు.], నిస్సంతుల సంతానకాంక్ష [సావిత్రి. 106 పు ], పతివ్రతా లక్షణములు, గుణహీనురాలి నడకలు. [సావిత్రి. 110 - 112 పు.]

శ్లేషానుప్రాణితమగు నుపమ యీ క్రింది వచనమునందు మిక్కిలి మనోహరముగా కానవచ్చును. "అప్పట్టణంబు పాతాళంబునుంబోలె ననంత భోగభాసమానంబై, కైలాసంబునుంబోలె సర్వమంగళాస్పదంబై, వైకుంఠధామంబునుంబోలె మాధవానందకరంబై .................. [పారి. 81 పు.]. దవ్వారికులు [సీతా. 13 పు.], వ్రిత్తాంతము [సీతా. 29 పు.], సమ్మంధి [సీతా. 37 పు], తప్పాపచారములు [పారి. 73 పు ], మనోహరములు (పిండివంట), వడలు [పారి. 87 పు.], యవ్వన [పారి. 87 పు.], మోడి [సావిత్రి. 106 పు.] — ఇత్యాది వింతప్రయోగము లిందు కలవు. ఈ క్రింది కందపద్యము గుర్వంతము కాదు. సంగీతానుగుణ్యమునకు కాబోలు లఘ్వంతముగా రచితము.

యాలలు పాడుచు రామన్న
పాలునిఁ గనుగొనుచు చెంచుబాలికలు మదిఁజా
గిలించిన మోహంబుల
తాలిమి దిగవిడిచి విరహతాపము బొందిరి. [సీతా. పు. 24]

## యక్షగానములు లభించిన వయినము, ముద్రణము.

1972 వ సంవత్సరములో నేను మదురై కామరాజ విశ్వవిద్యాలయమున ఆచార్యుడుగా ప్రవేశించినపుడు తొలిసారిగా నాకు రాజపాళయము వాస్తవ్యులును, బహుభాషావిద్వాంసులును నగు శ్రీ ముదునూరి జగన్నాథరాజాగారితో పరిచయమేర్పడినది. 1973 లో వారు నన్ను రాజపాళయములో జరుగు తెలుగు ఉగాది మహోత్సవములకు ఆహ్వానించిరి. నే నచ్చటికి పోయి యుండినపుడు వారు తమ గృహమున నుండిన తాళపత్ర గ్రంథ సంచయమును నాకు చూపిరి. పిదప ఆనాటి సాయంకాలము వారు నన్ను "గాంధీ కలై మన్రమ్" తో నేర్పాటుచేయబడిన తెలుగు

ఉగాది మహోత్సవ సభలకు గొనిపోయిరి. అచటి గ్రంథాలయములో చిరకాలముగా భద్రపఱుపబడి యుండిన ఒక తాళపత్ర గ్రంథమును వారు నాకు చూపుట తటస్థించినది. తాళపత్ర గ్రంథములను చదువుటలో ఆసక్తిని అనుభవమును కలిగియుండిన నేను వెంటనే దానిని అవలీలగా చదువ నారంభించితిని. ఎంతోకాలముగా దానిని చదివి, యందలి విషయములయొక్క విలువను గుర్తించి చెప్పగలవారు వారికి నాటిదాక తటస్థింపకుండుటచే దానిని నేను చదువుట వారికి ముదము గొల్పినది. సమావేశానంతరము సదరు గ్రంథాలయాధిపతుల యనుమతితో వా రా తాళపత్ర గ్రంథమును నాచేతి కిచ్చి యందు నిక్షిప్తపఱుపబడియుండిన గ్రంథసంచయము నుద్ధరించి వ్రాసి పంపమని కోరిరి. వారి కోరిక మేరకు నేను దానిని గొనివచ్చి యందలి గ్రంథముల నుద్ధరించి యచిరకాలముననే వ్రాసి యొసగితిని.

ఆ తాళపత్ర గ్రంథమందు ఐదు యక్షగానము లుండినవి. అవి 1. కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయము, 2. ఆండాళ్ చరిత్రము, 3. సీతాకల్యాణము, 4. పారిజాతాపహరణము, 5. సావిత్రి చరిత్రము. వానిలో కడపటి మూఁడు యక్షగానములును రాజపాళయము రాజకవుల యక్షగానము లగుటచే శ్రీ ముదునూరి జగన్నాథరాజాగారు వెంటనే వానిని ముద్రించి ప్రకటింపజేయ సంకల్పించిరి. రాజపాళయములోని సంపన్నులైన పారిశ్రామికవేత్తల, వదాన్యశేఖరుల సహాయ సహకారములతో నీ యక్షగానములను ప్రకటింపజేయవలయునని వా రా నాటినుండియు విశేష ప్రయత్నములను గావించిరి. గ్రంథ ముద్రణ వ్యయము నానాటికిని పెరిగిపోవుచుండుటచే వారు ఏతద్గ్రంథ ముద్రణమునకై అంతర్జాతీయ తెలుగుసంస్థవారిని ఆర్థికసహాయమునకై అర్థించిరి. పై సంస్థలవా రొసగిన ద్రవ్యసహాయముతోను, స్థానికులైన వదాన్యశేఖరుల తోడ్పాటుతోను, దీనిని సంకల్పించిన యేడుసంవత్సరములకు తరువాత నిప్పుడు ప్రకటింపజేయ గలుగుచున్నారు. పై సంస్థల, వదాన్యులతోడ్పాటే లేకుండినచో నివి యింకను ముద్రణభాగ్యమునకు నోచుకొనకపోయియే యుండును. వీని ప్రకటనము వలన ముఖ్యముగా రెండు ఫలితములు చేకూరుచున్నవి.

ఒకటి — తెలుగులో వెలసిన యక్షగానములు పెక్కు నేటికిని ముద్రణభాగ్యమునకు నోచుకొనలేదు. కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయము, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు తంజావూరు శరభోజీ సరస్వతీమహల్ గ్రంథాలయమునుండి సంపాదించి ప్రకటించిన యక్షగానములు చిరకాలముక్రింద ముద్రింపబడినను నవి

ప్రస్తుతము లభించుటలేదు. కనుక తెలుగుసాహిత్య విద్యార్థులకు యక్షగానముల స్వరూప లక్షణములను గుఱించి తెలిసికొనుట కుపయుక్తము కాగల ఆధారసామగ్రి నేడు దాదాపు శూన్యమనియే చెప్పవలసియున్నది. ఇట్టి స్థితిలో నీ యక్షగానముల సంకలనము ప్రకటింపబడుట యా కొఱతను పూర్తిచేయుచున్నది. యక్షగానముల యధ్యయనమునకు లక్ష్యభూతములైన కృతు లిందు సాహిత్యపరులకు లభించు చున్నవి.

రెండు — తమిళదేశమున నేటికిని తెలుగుభాషాసంస్కృతులకు పట్టుగొమ్మగా నున్న ఒకేయొక పట్టణము రాజపాళయము. తమిళదేశమును నాయకరాజులు పాలించిన కాలములో నీ ప్రాంతములందు తెలుగుసాహిత్యము మూడుపూవు లారు కాయలుగా వర్ధిల్లినది. తెలుగుదేశమునుండి వలసవచ్చి యిచ్చటి వివిధప్రాంతము లందు స్థిరనివాసములు కల్పించుకొనినవారును, ఇచటనే పుట్టి బ్రతికి బట్టగట్టినవారును నగు కవులు ఎన్నో కావ్యములను వెలయించి, విస్తారముగా సాహిత్యసృష్టి చేసిరి. ఆ సాహిత్యములో చాలభాగము నేటికిని తాళపత్రములయందే యడగియున్నది. ఏవో కొన్ని ప్రసిద్ధ గ్రంథములుమాత్రమే ముద్రణములో మనకు లభించును. అట్టిచో క్రీ. శ. పదునేడు, పదునెనిమిది శతాబ్దులలో రాజపాళయమునందు నివసించి రాజకవు లయి వాసికెక్కిన గొట్టుముక్కల వంశ్యులగు నీ కవులు రచించిన యీ మూడు యక్షగానములును దక్షిణదేశమునందు వర్ధిల్లిన తెలుగుసాహిత్యమునకు పరిచాయక ములుగా నుపకరించుననుటలో సందేహము లేదు. అల్పాల్పముగా మాత్రమే యున్న ముద్రిత దాక్షిణాత్యాంధ్ర గ్రంథములకు యీ చేరిక మిక్కిలి హర్షదాయకము.

ఈ యక్షగానముల నుద్ధరించి వ్రాయుటలో నేను కొన్ని సూత్రములు పాటించితిని. తాళపత్ర గ్రంథములో లిఖింపబడిన తీరును యథాతథముగా ననుస రించితిని. ఆధునిక లేఖన సంప్రదాయముల ననుసరించి యెట్టిమార్పును చేయ దలపెట్టలేదు. సందిగ్ధములైనవట్టుల, దుష్టములనితోచినపట్టుల నా యభిప్రాయములను కుండలీకరణములలో సూచించితిని. అర్థము కుదురనిపట్టుల మార్పుదొరకొనక యట్లట్లే యుంచివేసితిని. గ్రంథపాతములు గల చోట్లు గీతలతో సూచించితిని. గ్రంథభాగమునం దెచ్చటను సవరణలుగాని, సంస్కారములుగాని చేయలేదు. మొత్తముమీద కవిహృదయమును, ప్రాచీనలేఖనపద్ధతులను వెల్లడిచేయురీతిగా వీని

నుద్ధరించి వ్రాయుటకు ప్రయత్నించితిని. ఇం దెంతవఱకు కృతార్థుడ నయితినో తెలుపుటకు సహృదయులు ప్రమాణము.

శ్రీ ముదునూరి జగన్నాథరాజాగారు యీ యక్షగానముల సంకలనమునకు నన్నే పీఠిక వ్రాయుమని కోరిరి. అది నాపట్ల రోగి యేపథ్యము కోరెనో వైద్యుడును నదియే విధించిన ట్లయినది. ఈ సదవకాశమును నాకు కలిగించి, నాచే నిట్లు తెలుగు సరస్వతీసమారాధనము గావింపఁజేసిన శ్రీ ముదునూరి జగన్నాథరాజాగారికి నా హృదయపూర్వకమైన కృతజ్ఞత నెట్లు తెలుపుకొనవలెనో నాకు తెలియకున్నది. వారు నన్ను దీనికొాక చిన్ని పీఠికను వ్రాసి యిమ్మని కోరిరి. అట్లే వ్రాయ దొరకొంటిని. కాని అది ''ఇంతింతై వటు డింతయై'' అనినటుల పెరిగిపోయినది. వీనికి సంబంధించిన సకల విషయములను పాఠకలోకమునకు తెలియజేయవలయు ననెడు యాకాంక్షయే యీ పెరుగుదలకు కారణము. దీనికి వారు నన్ను క్షమింతురనియే యాశింతును.

మదురై, రౌద్రి మార్గశిరము,
వైకుంఠఏకాదశి, 18-12-1930.

తిమ్మావఝ్ఝల కోదండరామయ్య

# రాజపాళయం రాజకవుల
# యక్షగానములు

౧

# సీతాకల్యాణం

గొట్టుముక్కల కృష్ణమరాజు

శ్రీరస్తు

శుభమస్తు

అవిఘ్నమస్తు

# సీతాకల్యాణం

శ్రీవైదేహీ నిజాంగలిప్త నవకాశ్మీరాంక నాథోరువ
క్షో విభ్రాజితహారమౌక్తి ... ... ... ...
... ... జూడ నొప్పు నిగమాంతస్వాంతవేద్యం దయా
భావుఁ రాము కకుత్స్థ వల్లభు మదిఁ భావింతు నశ్రాంతముఁ.

అర్ధ చంద్రికలు.

వాణీవల్లభు వనజజు గొలుతుఁ
గౌరీపతి కరకంఠుని గొలుతుఁ
నందితగుణ గణనాయకు గొలుతుఁ.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబుంజేసి కవీశ్వరుల నేమని కొనియాడుచున్నాడు.

సీ. వ్యాసులకును మ్రొక్కి వాల్మీకు సేవించి
కాళిదాసాది సత్కవుల బొగడి
సంగీత విద్యాప్రసంగ రహస్యాది
జ్ఞానుల తుంబురునారదాది
ఘనుల కీర్తించి తిక్కన యాదిగా నంధ్ర
భాషాకవీంద్రుల ప్రణుతి చేసి
వొప్పులఁ దప్పని వారల దిద్దెడు
దుష్కవులకు ప్రియోక్తులు ఘటించి

గీ. వర్ణితం బగు చతురకావ్యములు చెప్పు
చతురకల్పనకవుల కంజలి యొనర్చి

వర్తమానకవీంద్రుల వరుస దలచి
భావికవులను మది నూని ప్రస్తుతించి.

క. పగళాతం(?) సద్వంశుని
జగదభినుతకీర్తిహారు సన్నుతిఁ దలఁతున్
నిగమాంతవేద్యు మద్గురు
అగణితగుణధుర్యు లక్ష్మణాచార్యు మదిన్.

త్రిపుట.

శ్రీధనంజయగోత్రపాత్రుఁడ శేషభూపతిసు(ను?)తుఁడ సద్గుణ
సాధకుం డగు గొట్టుముక్కుల శాసనుండన్
వరదనృపతికి వెంకటాంబకు వరతనూజుఁడ సుగుణనిధి యై
పరగు వెంకటరాజు తమ్ముఁడ భవ్యయశుఁడన్.
వ్యాసమునివరకరుణ కవితా వాగ్విలాసము మెరయువాడను
రాశి కెక్కినయట్టి కృష్ణమరాజసుకవిన్

వ. యే నొకపురాతన పుణ్యచరిత్రంబు చెప్ప నుద్యోగించి యొక్కనాడు శుచి
ప్రదేశంబున నిద్రితుండ నైయుండ మదీయస్వప్నంబున.

ద్వి. కపిలజటాభారకలితుఁ డై విష్ణు
విపులదేహద్యుతుల్ వింతలు గాఁగ
నిగమాంతవేద్యు నన్నీరజోదరుని
చిగురొత్త నాత్మలో చింత జేయుచును
భూతి మైనింత నద్భుతముగా నలఁది
కౌతుకంబున వచ్చి కరమొప్ప నిలిచి
వత్స! లేలెమ్ము ... ... ... ...
... ... ... ... సంగ వచ్చితిని
వాణి నీజిహ్వను వలనొప్ప నిలుచు
త్రాణ మించిన కవిత్వము చెప్పు మిఁకను
తొడరి నీ విప్పు డుద్యోగించి చెప్ప
కడఁగెడు కథ యక్షగానంబు గాఁగ

సీతావివాహ మూర్జితముగాఁ జెప్పి
ఖ్యాతి లోకములోన ప్రఖ్యాతి గనుము
పంకజాక్షుఁడు రామభద్రుని పేర
నంకితంబుగఁ జేయు మని యానతిచ్చి
అంతర్హితుం డయ్యె నంత మేల్కాంచి
వింతయై మది జాల విస్మయం బొదవ
యిట్టి భాగ్యము గల్గె నెట్టి పుణ్యంబొ
ఘట్టిగా వ్యాసుల కరుణ నా కనుచు
సరు(రఁ)గ రాముని కృతీశ్వరునిగాఁ జేసి
పరువడి నద్దేవు ప్రణుతింపఁ దొడఁగె.

వ. కృతీశ్వరుఁడైన రాఘవేశ్వరుని నేమని గొనియాడుచున్నాఁడు.

జంపె.

నీలమేఘశ్యామ నిజకాంతిజితసోమ
శ్రీలసద్గుణధామ శ్రీరామ గొలుతుఁ
జానకీసతికామ మానవప్రియనామ
శ్రీనివాసోద్దామ శ్రీరామ గొలుతుఁ
దుష్టగర్వవిరామ దూరదోషస్తోమ
శిష్టజనవిశ్రామ శ్రీరామ గొలుతుఁ.

వ. అని యద్దేవునకు షష్ఠ్యంతములుం జెప్పెనట యెటువలెను.

జంపె.

ప్రమదమున కడు మించి భార్గు విల్లుం ద్రుంచి
రమణ విలసిల్లు దశరథరామునికిని
పక్షివాహన మెక్కి ఫణిఫణాగ్రముఁ ద్రొక్కి
రక్షకుండైన దశరథరామునికిని
ఆజిలోపల బట్టి అసురవీరుల గొట్టి
రాజిల్లునట్టి దశరథ రామునికిని

వ. అంకితంబుగా నా యొనర్పం బూనిన సీతాకల్యాణం బను యక్షగానంబు నకు కథాసంవిధానం బెట్టి దనినా.

అటతాళం.

చాతురీమణి సౌధ గోపుర సన్నుతంబూ హాటక
కేతుతోరణరాజితము సాకేతపురము
కులుకుగుబ్బలు మెరుగుమోములు కోర్కులీనా వీధుల
వలను మీరఁగ నుందు రప్పురి వారసతులు
నాతిరో పూదండ యెత్తవె చూత మనినా నిగ్గున
జాతు రప్పురి పుష్పలావిక సుదతు లెలమిన్
నీరనిధి రత్నాకరం బని పేరు గాని యీపురి
చారుమణులకు నాకరం బగు కోరి జూడన్
కలభములపై నెక్కి యాకసగంగలోన తామర
లెలమి గోయుదు రనిన గజముల నెన్న నేలా
వెరచి యంబుధి బడఁగఁబోయెడుకరణి బోవుం దివి రవి
హరుల చూచి హసించు నప్పురి తురగచయము.

వ. మరి న్నేమని కొనియాడుచున్నాడు.

అర్ధ చంద్రికలు.

నటులును భటులును విటవిసరములున్
త్యాగులు జీగులు నాగరికులున్
కధికులు రధికులు పృథువిక్రములున్
ధీరులు శూరులు వీరవినోదుల్
గాయక నాయక సాయక ధరులున్
వాటపు గాటపు తోఁటలు వనముల్
యేచి పూచి తగ కాచి ఫలించున్
వొప్పగు నప్పురి గప్పుర గంధుల్
మేడల నీడల వేడుక ప్రియులన్
కూడుచు నాడుచు పాడుచు రతులన్
కలయుచు నలయుచు సొలయుచు నుందెన్.

వ. యిట్లనంతభోగాస్పదంబగు పరిఘా సాల గోపురాట్టాలకప్రాసాద వీరభట హయరథ గంధసింధురంబై శాత్రవవీరనృపసాధ్యయగు నయోధ్య యొప్పు. నప్పురంబున కధీశ్వరుండు.

ద్వి. ఆపురి యేలు బాయక మనోజాత
రూపనిర్జితకళా రూఢ మహీశ
మకుటకీలితజాతి మాణిక్య జాల
నికరకాంతి చ్ఛటా నీరజనాభి
విధి విహితాచార విమలుఁడై యేకి
రఘుఁడైన యాదశరథమహారాజు
బాణతూణకృపాణ పటుతోరణముల
త్రాణ మించిన యరదం బెక్కి వేడ్క
దిక్కులు గెలిచి ధాత్రీంచరాధిపుల
పెక్కండ్ర బరిమార్చి ప్రేమ రెట్టింప
ధర కోసలాధీశతనయ కౌసల్య
వరలు కేకయరాజవరసుత కైక
మగధుని కన్యకామణి సుమిత్రయును
తగు ధర్మపత్నులై తనర నిష్టోప
భోగంబులును రాజ్యభోగసంపదల
భోగదేవేంద్రుఁడై పొలుపగ్గలించి
ధర్మమార్గంబున ధరణి పాలించి
నిర్మలకీర్తులు నిఖిలదిక్కులను
వెదచల్లి యిరువదివేలేండ్లు రాజ్య
ముదుటున పాలించి యుర్వీధవుండు
దనరాజ్యమున రుజాతంక దుర్భిక్ష
ఘనపీడ లేమియు గానరాకుండ
ప్రజల రక్షింపుచు పార్థివేశ్వరుఁడు
నిజమతి నొకనాఁడు నెరి విచారించి
సంతతి లేనట్టి జన్మ మే లనుచు
చింతించి గురువు వశిష్ఠునిఁ జూచి

కరములు మోగిచి గద్గదకంఠుఁ డగుచు
నిరవొంద నతనితో ని ట్లని పలికె.

వ. అప్పుడు దశరథుండు వసిష్ఠునితో యే మనుచున్నాడు.

త్రిపుట.

తాపసోత్తమ! సుగుణగణసంతానహీనుఁడ నగుచు నీగతి
రూపహీనత నుండ మది సంతాప మొదవెఁగా
కులము రక్షించుటయు నాల్గు గుణము లధికము పుణ్య మని ముని
కులవతంసమ! చెప్పుదురు లోకులు మహాత్ముల్
దేవ! నీచిత్తమున దీనికిఁ దెలుపు మార్గ మటంచు మహిపతి
శేవ చేయుచు నుండె దీనవిచేష్టుఁ డగుచుఁగా.

వ. అని దీనవదనుండై ప్రార్థించుచున్న దశరథనృపాలునిం జూచి యనాగ తంబు విచారించి సంతానలాభంబు గలదని నిశ్చయించి వసిష్ఠుం డేమను చున్నాడు.

క. సుతహీనుఁ డైన యతనికి
గతి లే దని వేదవాక్యగతి దెలుపంగా
నితరముఁ జెప్పఁగ నేఁటికి
సుతులకు నుద్యోగి వగుదు సూనృతవర్యా!

వ. మరిన్ని యే మనుచున్నాడు.

త్రిపుట.

యెన్నఁదగియెడునట్టి సుతకామేష్టిఁ జేసిన సుతులు గలిగెద
రన్న వగవఁగ నేల నీకు ననుదినంబుఁగా
యాగసంభారములు దేరఁగ నంపు ఋషులను బిలువఁ బంపుము
వేగమున సాగింపు మింకను జాగు లేకా.

వ. అనిన దశరథుండు సంతోషాంతరంగుండై అప్పు డేటువలె నుండెనూ.

జంపె.

హితుఁడైన తనపురోహితుని వాక్యములకు
మతిలోన సంతోషమగ్నుఁడై యలరెఁగా

చతురమతియై యజ్ఞ సంభారముల నెల్ల
ప్రతిఘడియ దెప్పించె పార్థివేశ్వరుఁడు
శాంతతోఁ గూడ ఋశ్యశృంగుఁ బిలుపించి
చింత వాయంగ దీక్షితుఁడయ్యె నంతన్.

వ. యివ్విధంబున సకలమునిగణసమేతుఁడై పుత్రకామేష్టి సేయునప్పుడు.

ద్వి. అంత నిక్కడ దేవతారాధ్యుఁ డమర
సంతతితోఁ గూడఁ జని విష్ణుఁ గాంచి
చక్క సాగిలి మ్రొక్కి సరగున లేచి
దిక్కైన యయ్యాదిదేవునిఁ గాంచి
జయ రమావల్లభ! జయ భక్తసులభ!
జయ దేవతారాధ్య! జయ వేదవేద్య!
జయ శేషపర్యంక! జయ గరుడాంక!
జయ పుండరీకాక్ష! జయ హారవక్ష!
సకలజీవులకు రక్షకుఁడవై నీవు
ప్రకటిత నుండ మా పడినపా టెల్ల
వినుము రావణుఁ డనువిఖ్యాతబలుఁడు
దనుజుఁడు కైకసి తనయుండు దేవ
భూసురావలిఁ బట్టఁ బుణ్యాశ్రమములు
గాసిగాఁ జేసి పెక్కింద్ర మౌనులను
పృథుశక్తి వధియించి పెంపగ్గలించి
మథితదిక్పాలుఁడై మరియును కడఁగి
వాసవుఁ బట్టి గీర్వాణులఁ గొట్టి
రాశి కెక్కిన పరాక్రమశాలి యగుచు
మించి లోకము లాక్రమించి దేవతలఁ
బంచబంగాళమై పారంగఁ దోలి
వరగర్వ దుర్వార వైభవస్ఫురణ
బెరికి(గి?) యందరఁ బాధఁ బెట్టుచున్నాఁడు
అని విన్నపము శేయ నబ్జజుం జూచి

వనజోదరుఁడు పల్కె వాని నన్యులకు
మదియింపఁగా రామ మనుజులచేతఁ
బడు రణస్థలి యట్టి పద్ధతి వినుము
మనుజుండనై యేను మహి జనియింతు
వనచరులై మీరు వడిఁ బట్టుఁ డనుచు
అనతి యిచ్చిన నతిమోదమునను
జానొప్ప నిజనివాసములకుఁ జనిరి.

వ. అంత నక్కడ మునీశ్వరులతోఁగూడ పుత్రకామేష్టి సేయించేక్రమం బేరీతి నుండెను.

త్రిపుద.

వీర్యవంతము వైనమంత్రము లార్యసభ జపియించి వేల్వఁగ
కార్య మట యూహించి స్వాహాకాముకుండు
దివ్యరూపము దాల్చి కరుణాదృష్టి రాజవరేణ్యుఁ జూచుచు
భవ్యపాయసభాజనముతోఁ బ్రభవ మొందెన్
రాజ! యీపరమాన్న మిప్పుడు రమణతో నీసతుల కొసఁగుము
రాజకీర్తులు సుతులు పుట్టుదు రాజిబలులు.

వ. అని యిచ్చి యద్దివ్యపురుషం డంతర్ధానం బగుటయు రాజు హర్షపులకిత గాత్రుం డగుచు నప్పాయసంబు తనదేవుల కెటువలెఁ బంచిపెట్టు చున్నాఁడు.

త్రిపుద. జంపె.

సగము కౌసల్యకును సగములోపల
సగము తగనిచ్చె నాసుమిత్రాకాంత కెలమిన్
కైకేయి కిచ్చె నుత్కంఠ నాసగములో
ప్రాకటంబుగ సుమిత్రకు నిచ్చె మఱియున్
ఆపాయసాన్నంబు లర్థితో భుజియించి
భూపకాంతలు గర్భములు దాల్చి రెలమిన్.

వ. యిట్లు గర్భంబులు ధరియించినకాంతల కిమ్ముగా గర్భరక్షణంబు శేయం

బనిచి యథావిధి గర్భసంస్కారార్థంబు శాంతికపౌష్టిక విధానంబులు జేయింపుచుండె నంత గర్భచిన్నె లెటువలె నుండెను.

జంపె.

వలరాజు పసిడిబరణుల ముద్ర యిడినట్లు
నలినాక్షి చూచుకంబులు నల్లనాయెఁ
కందుచందురుఁడు సరిగాఁడు నా కని నవ్వ
చందమున ముఖకాంతిచంద్రికల సీనెఁ
పుణ్యగర్భము లట్లు పొలతుకలు ధరియించి
వర్ణింప నొప్పి వరవర్ణినుల వేడ్కఁ.

వ. అంత నొక్కశుభముహూర్తంబున కౌసల్య రాముం గనియెనట, యెటువలెను.

జంపె.

చైత్రశుద్ధనవమియును సౌమ్యవాసరమందు
పాత్ర మగు దితితార ప్రఖ్యాత మగుచుఁ
లలితకర్కటకశుభలగ్నంబులను పాల
జలధిలో నమృతంబు జన్మించుకరణిఁ
తరణివంశమునందు ధరణి కౌసల్యకును
పరమపురుషుఁడు రామభద్రుఁ డుదయించెఁ
తనర కైకయరాజతనయ భరతునిఁ గాంచె
వనరాశి కల్పతరువును గన్నకరణిఁ
శత్రుఘ్నలక్ష్మణుల సరవితో డుత గాంచె
మిత్రజనసన్నుత సుమిత్ర వేడ్కఁ
సొరిది పువ్వులవాన సోనగా ధరఁ గురిసె
సురదుందుభులు మ్రోసె పురుహూతునగరఁ.

వ. అంత సుతులు నలుగు రుదయించి రని రాజునకుం జెప్పి రట యెటువలెను.

అటతాళం.

సుతులు నలువురు బుట్టిరని రాజునకుఁ జెప్పఁగా చెప్పిన
హితుల కొసఁగెను వస్త్రభూషణ హేమరాసుల్
కనకములు దెప్పించి రాసులు గాఁగఁ బోసి ద్విజులకు
తనయ నిచ్చెను వస్తువాహన తతులతోడఁగా
భూరివిభవముతోడ రాజకుమారులకును వేడుక
లూర నప్పుడె జాతకర్మము లొప్పఁ జేసెఁగా.

వ. యిట్లు జాతకర్మంబలు నిర్వర్తించి పన్నెండగుదివసంబున నామకరణంబు లేరీతున జేయింపుచున్నాఁడు.

త్రిపుద.

రామలక్ష్మణ భరత శత్రువిరాము లనియెడినామధేయము
లామహాత్ముల కిడియె నప్పుడు భూమివిభుఁడు
విదియచందురుఁ డుదుటు కవలను బొదలువిధమున కొదమప్రాయము
లెదుగ రదనవిహీనవదనము ముదము నొసఁగెఁగా
అత్త అత్త యటంచుఁ బల్కుచు తత్తరంబున నడుగు లిడుచును
ముత్తియంబులపగుది తల్లులచిత్త మలరఁగా.

గీ. మారవరరూపజితు లాకుమారవరులు
ప్రకటకాంతుల సూర్యబింబము లనంగ
మగతనంబుల సింహసమాను లనఁగ
కరము చూపర కాశ్చర్యకరము గాఁగ.

వ. యివ్విధంబున సంవర్ధితగాత్రు లగు రాజపుత్రులకు చౌలోపనయనాదిక్రియా కలాపంబలు నిర్వర్తించి వేదవేదాంగాది విద్యలును ధనుర్వేదంబను నావెగా గలుగు సకల విద్యలయందు ప్రవీణులై గజతురగరథారోహణంబుల నేర్పరులై పెరుగుచున్న సమయంబునా.

ద్వి. అట కౌశికుఁడు యాగ మర్థితోఁ జేయ
కుటిలరాక్షసవరుల్ ఘోరరక్తముల
మాంసంబు లెమ్ములు మద్యముల్ గురిశి

హింస గావింపంగ యెరిగి యమ్మౌని
మఖరక్షణార్థమై మానవేశ్వరుని
రఘుకులోత్తము గొని రావలె ననుచు
జడముడి వెట్టి విశాలవక్షమున
తడబడ రుద్రాక్షదామముల్ వైచి
అజినాంబరము గట్టి యఖిల దిక్కులను
నిజదేహకాంతి రాజింప వేవేగ
దండకమండలధారియై విమల
ఖండేందుధరురీతి కరము సంప్రీతి
బలసి శిష్యులను వెంబడి నేగుదేరి
పొలుపారు సాకేతపురవరంబునకు
వచ్చి హజారంబువాకిట నిల్వ
నచ్చెరుపడి భీతి నంజలి చేసి
దవ్వారికులుఁ బోయి దశరథేశ్వరుని
కవ్వార్త యెఱిఁగింప నాప్తులతోడఁ
గూడి రా నమ్ముని కులవతంసునకు
వేడుక రెట్టింప విభుఁ డెదురేగి
దండప్రణామంబు తగ నాచరించి
మండలాధీశుఁ డమ్మౌనిశేఖరుని
వెస నర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి
అసమునఁ గొనివచ్చి యర్ఘ్యపీఠమున
కూర్చుండ నియమించి కుశలంబు లడిగి
యర్చితుం డగుమౌని కంజలి చేసి
దేవమునీంద్ర! మీదివ్యవిగ్రహము
భావించి గంటి నాభాగ్య మెట్టిదియొ
వచ్చినకార్యంబు వలనొప్ప చెప్పుఁ
డిచ్చెద ననిన మునీంద్రుఁ డి ట్లనియె.

వ. అప్పుడు విశ్వామిత్రుఁడు దశస్యందనుతో యే మనుచున్నాడు.

అటతాళం.

వినుముఁ జెప్పెద నాదురాకకు మనుజనాథా! యజ్ఞము
ఘనతఁ జేసెద మనుచు నుద్యోగంబు శేయఁగా
వడి సుబాహుఁడు దుష్టచిత్తుఁ డవార్యబలుఁడు తాటకి
కొడుకు మారీచుండు రాక్షసకులవిభుండు
క్రూరకర్ములు వచ్చి రక్తము గోరి గురియఁగా దినమును
చేరి యాగంబునకు విఘ్నము శేయుచుండఁగా
యాగదీక్షితు లైనమాకును నలుగ రామి యిచటికి
వేగ వచ్చితి నీదువరకు వివేకనిలయా!

వ. అని మరియు విశ్వామిత్రుం డే మనుచున్నాఁడు.

త్రిపుద.

అవనినాయక! సీతనూభవుఁ డైనరామునిఁ బంపు మిప్పుడు
సవనరక్షణ శాయ నాతఁడు జాలు మాకుఁగా
బాలుఁ డని శంకింప వలవదు లీల నీతఁడు దనుజబలముల
దోలి యాహవభూమి నందరఁ గూల నేయుఁగా
మనుజమాత్రుం డనుచు యంచకు దనుజగర్వవిదారుఁ డితఁడు
వనజలోచనుఁ డైన విష్ణుఁడు వసుమతీశా!

వ. అనిన విని దశరథేశ్వరుండు భయకంపితచిత్తుండై నిశ్చేష్టితుండై యూరకుండి కొంతశేపునకుం దెలివొంది విశ్వామిత్రునితో యేమనుచున్నాడు.

జంపె.

అయ్య రాక్షసవీరు లతిశౌర్యబలయుతులు
కయ్యమున వారి నొక్కఁడు గెలువఁగలఁడా
చిన్నపాపఁడు వీఁడు మున్ను కయ్యము లెరుఁగఁ డెన్నఁడును
మీవెనుక నెట్లంప నేర్తుఁగా
నేనైన వచ్చెదను శేనతోఁ గూడుకొని
బూని రాక్షసకోటిఁ బోరిమార్చుకొంటకుఁగా.

ద్వి. అని యిట్లు దశరథుఁ డాడువాక్యములు
విని కౌశికుఁడు రోషవివశుఁడై పలికె
జననాథ! సూర్యవంశమునందుఁ బుట్టి
చనునె నీ కిట్లు అసత్యంబు బలుక
నీరాజసం బెంత నీరాజ్య మెంత
గారవంబున నన్నుఁ గైకొన వైతి
యే నల్గినపుడె యీ రేడులోకములఁ
బూని భస్మీకరంబనఁ జేయ లేనె
అని రోషతామ్రాక్షుఁడై నలుదిశలు
కనుగొన జగములు కంపింప నపుడు
తటతట పెదవులు తాటించుకొనుచు
పెటపెట యని దంతపీడ యొనర్చి
కటములు బొంగ నుత్కటకోపుఁ డగుచు
కటకట యని శిరఃకంపంబుఁ జేయ
కన్నుల విస్ఫులింగంబులు చెదర
వెన్నున జడముడి వీడి నటింప
రోషించులయకాల రుద్రుని భంగి
భీషణాకారతఁ జేర్చి లేచుటయు
అంభోధి కలఁగె కులాద్రులు వణఁకె
జంభారి వజ్రంబు చయ్యన విడిచె
ఫణిరాజు భయమున పడగలు వంచె
క్షణములో రాలె నక్షత్రంబు లెల్ల
భానుఁడు మాసె భూభాగంబు గ్రుంగె
దీనులై సురలు ప్రార్థించి రబ్జజుని
సభవారు భయగతస్వాంతులై వేఁడి
రభయంబు లిమ్మని యమ్మునిచంద్రు
నంత నంతయుఁ జూచి యా వసిష్ఠుండు
చింత యంతయు లేక చిరునవ్వుతోడఁ
దెలివైనకన్నుల దెగడెడి యందు

దల యూఁచి యతని నింతయును గైకొనక
కపట మేమియు లేక కార్యంబు దెలిశి
విపులవాచాప్రౌఢి వెలయ ని ట్లనియె.

వ. అంత నరుంధతీవల్లభుండు వసుంధరావల్లభుండైన పంక్తిరథునకు
సాంత్వన స్వనంబుతో యే మనుచున్నాఁడు.

యెకతాళి.

భూమీశులు మును బొంకినవారిని
యీమహి నెన్నఁడు యెరుగము మేముౘా
యీమునిపతితో నిచ్చెద నని యిపు
దేమరి బొంకిన నిది తగ వగునా
నీమదిలోపలి ప్రేమము లూరఁగ
రాముని బంపుము తామస ముడిగి
యిట్టి మహాత్ముల కిచ్చిన సుకృతము
పెట్టనికోట యభేద్యము మనకుౘా
విశ్వామిత్రునివెంబడి యంపిన
శాశ్వతపదవులు సమకురు నీకుౘా.

గీ. అనిన మునినాథుపలుకుల కాత్మలోన
సంతసం బంది దశరథక్ష్మావిభుండు
తనయులను వేగ పిలుపించి దయ దలిర్ప
కన్నుగవ నశ్రుకణములు కడలుకొనఁగ.

వ. దశస్యందనుం డే మనుచున్నాఁడు.

జంపె.

తాపసోత్తమ! చిన్నిపాపఁ డీరాఘవుఁడు
చేపట్టి రక్షింపు కాపట్య ముడిగి
నీవెంట వచ్చినను యేవెంట నీతనికి
భావింప మది చింత యావంత లేదు
మునినాథ! కొనిపొమ్ము జననాథ తనయులను
దనుజాధములు జేయు ఘనబాధ లణఁపౘా.

వ. యిట్లు రామలక్ష్మణుల మునీశ్వరునకు నప్పగించిన దీవించి రాజపుత్రులం
దోడ్కొని పోయె నట యెటువలెను.

అటతాళం.

యాగ మిక యీడేరె నని మది జాగు లేకా మునిపతి
వేగ బయనము గదలె రాజులు వెంట రాఁగఁ
జోక యనుచును పురజనంబులు మూక గూడి వీథుల
రాకుమారులఁ జూచు వేడుక ప్రాకటముగా
బలము నతిబల మనెడివిద్యల బలముపేర్మిఁ బాలుల
కలఁత యాఁకలి దప్పియును లే దయ్యె నపుడు.

ద్వి. అరీతి కౌశికుఁ డారాజసుతుల
వీరాగ్రగణ్యుల వెస దోడుకొనుచు
చని చని యారాత్రి సరయువుపొంత
ననువుగా నిద్రించి యామరునాఁడు
వెరవొప్ప సంధ్యాది విధు లొప్పఁ దీర్చి
కరము సంప్రీతితో కదలి పోవుచును
ఘనసింహశార్దూల గండభేగవయ
వనలులాయవ్రాత వరవరాహాది
మృగపక్షిరవములు మిక్కిలి భయద
మగుచున్న దీవనంబున కౌశికుండు
రామచంద్రునిఁ జూచి రఘువీర ! వినుము
రా మహాటవిలోన యప్పుడు నుండు
తాటకి యను నొక్క దానవురాలు
మేటిసత్త్వంబుల మించి తాపసులఁ
బలువురఁ జంపి దోర్బలశక్తి మెరశి
చలమున మరి దాని జంప నెవ్వరును
జాలరు నీచేత చచ్చు నిక్కంబు
వాలాయమును నన్న వసుధీశసుతుఁడు

కౌశికముని( జూచి కరములు మొగిచి
భాసురంబుగ దయాభావు(డై పలికె.

వ. రామచంద్రుం డమ్మునిచంద్రునితో నే మనుచున్నా(డు.

త్రిపుట.

దేవ తాటకి యంత దీని మును( దెలియ( బలికితి నేను విన(గను
భావమున దయ లేక( జంప(గ( బాడి యగునె
మగువ( జంపుట పౌరుషములో( దగిలి యుండదు పాపకర్మము
తగవు దప్పినచేత యిది యొకమగతనంబా
తపనకులమున( బుట్టి దిక్కు-లు విపులకీర్తులమించి వెలశిన
నృపతు లెవ్వరు( జేయ రిది కడు నపయశంబు.

వ అనిన విశ్వామిత్రుం డేమనుచున్నా(డు.

జంపె.

యనయ గోబ్రాహ్మలకు హింస గావించినను
చను జంపస్త్రీల నైనను రాజులకును
వనజనేత్రు(డు దృఢవ్రత యన(గ భృగుపత్ని
మొనశి( జంప(డె జగంబులు బాధశేయగా
యింద్రుండు జంపండె యిల మునుల బాధింప
సాంద్రరోషత విరోచను( గూ(తు నెలమిగా
నీవు యీ తాటకిని లావు గలబాణముల
దేవగణములు బొగడ( దెగ(జూ(డుమయ్యా.

వ. అనిన ముని యాజ్ఞయు తంద్రిపనుపును మనంబునం దలపోశి తాటకీ
సంహారమున కుద్యోగపడెనట యెటువలెను.

అర్ధ చంద్రికలు.

ధనువున ననువుగ గొనయము గూర్చెగా
కవదొన యిరువంకల ధరియించెగా
గుణరవమున దిక్కు-లు వగులించెగా

దనుజాంగన విని ఘనకోపమునన్
అట్టహాసమున నద్రులు వణఁకన్
పదఘట్టన భూభాగమె గ్రుంగన్
వచ్చిన గని కడు నచ్చెరుపడుచున్
శరము లురమునను దరుమగ నాటన్
పరువడి గురిశిన దెరలక యదియున్
జలజల శిలలును చలమున వ్రేయన్
బాణ మొక్కటనె ప్రాణము గొనియెన్
గిరిగొని సుర లటు కీర్తన సేయన్
బొరిబొరిఁ గురిశిరి పువ్వులవానల్.

వ. యివ్విధంబున తాటకి సంహారం బొనర్చి విశ్వామిత్రునకు నమస్కరించిన గాఢాలింగనంబుఁ జేసి సంతోషాంతరంగుండై రాఘవులకు దివ్యాస్త్ర మంత్రోపదేశంబుఁ జేసె నట యెటువలెను.

తిపుట.

వారుణంబును దారుణం బగు గారుడంబును వాయుబాణము
సార మాగ్నేయమును బ్రహ్మాస్త్రం బొసంగెన్
విధులు మంత్రము లస్త్రబలములు వెసఁ బ్రయోగము సంహారంబును
బుధులు మెచ్చఁగ నిచ్చె రాఘవభూమిపతికిన్
రాసుతులఁ దోడ్కొనుచు నిజవనవాసముల కేతెంచి యాశ్రమ
వాసు లెదురుగ వచ్చి యంజలి చేశి బొగడన్
యాగదీక్షితు లైనమును లనురాగమున మంత్రముల వేల్వఁగ
నాగమోక్తము గాఁగ సాగెను జాగు లేకా
హోమధూమము లాకసంబునఁ బ్రామికొని నలుదిశలఁ బర్విన
తామసులు రాక్షసులు యజ్ఞవిరాము లగుచున్
చండరవమున నిండ కాటుకకొండలో యన నుండి యాకస
మండలంబున నుండి కడు నుద్దండకేళన్.

వ. యిట్లు ఘోరాకారు లగు నిశాచరులు వీరుల భయదాట్టహాసంబులతో యజ్ఞంబునకు విఘ్నం బాచరించి రట యెటువలెను.

అటతాళం.

కారుమేఘము నిలిచి వరుషము చేరి కురియూ విధమున
ఘోరదనుజులు రక్తమాంసము కోరి గురియఁగా
వమనములు గావించి యగ్నుల సమయఁజేసి ఋషులను
క్రమము దప్పక శిలలు రువ్వుచు భ్రమయఁ జేయఁగా
తత్తరంబున లేచి వర్మము లెత్తికొనుచుఁగా దనుజులు
మొత్తెదరు పద పదఁ డటంచును చిత్త మెరియఁగా.

ద్వి. అప్పుడు కౌశికుఁడు దయారామచంద్రుఁ
దప్పక చూచి యెంతయు వేడ్కఁ బలికె
దనుజాధములు వచ్చి తాపసోత్తముల
పెనుపొంద బాధలఁ బెట్టుచున్నారు
మనమునఁ గృపమాలి మడియింపువీరి
ననిన రాఘవుఁడు కోపాటోపుఁ డగుచు
విలు గుణధ్వనిఁ జేసి విపులసత్త్వమున
వలఘుబాణము లేయ నాదైత్యబలము
జెదరి నల్దిక్కులు చీకాకు పడఁగ
బెదరకుం డనుచు గంభీరఘోషమున
మారీచుఁ డలిగి తామ్రాక్షుఁడై ఘోర
నారాచముల పెక్కు నరనాథుమీఁద
బరగించి యార్చి దోర్బలశక్తి మెరశి
మరియును పటుబాణమగ్నినిఁ జేయ
రాముఁడు విలయ రౌద్రాకారుఁ డగుచు
నామహాశరములు నన్నియుఁ ద్రుంచి
పటుభల్లమున విల్లు భగ్నంబుఁ జేసి
చటులబాణముల జర్ఝరితాంగుఁ జేయ
కోపించి దిక్కులు ఘూర్ణిల్ల వాఁడు
భూపాలుపై గదం బుచ్చి వైచుటయు
నవి చండభాను సహస్రప్రకాశ

విదితమై యేతేర వేగ రాఘవుఁడు
వాఁడితూపున దాని వడి చెడ నేశి
గాధేయుఁ డిచ్చిన ఘనవాయుశరము
సాధించి వింటను సంధించి యేయ
అది వానియురము పెల్లగలంగ గిట్టి
యుదధిలోపల శతయోజనంబులను
దూరంబుగాఁ బడఁ ద్రోచె వాసవుఁడు
చేరి తృంచిన గిరిశృంగమో యనఁగ
అంత నాతనితమ్ముఁ డతిశౌర్యబలుఁడు
పంతంబు మెఱయ సుబాహుఁ డనువాఁడు
రామునిమీఁద నారసపరంపరలు
వేమారు గురియించి వెగడందఁ జేయ
నరిమురి గోపించి యగ్నిబాణమున
నుర మేయ నాతండు నుర్విపై గూలె.

వ. అని యివ్విధంబున రాక్షసుల సంహరించి వచ్చి విశ్వామిత్రునకు దండ ప్రణామంబు లాచరించిన రామలక్ష్మణుల నతిప్రియపూర్వకంబున సంభావించి దశరాత్రంబులు నిండిన యజ్ఞ సమాప్తి గావించి సకలమునిజననికర మధ్యంబున రామచంద్రు నేమని కొనియాడుచున్నాఁడు.

జంపె.

రఘుకులాంబుధిచంద్ర యఘదూరగుణసాంద్ర
మఘరక్ష సేయు టేమని చెప్ప వచ్చుఁ
శ్రీరాము మునిమానసారామ సంచార
సారామలప్రీతి గారాము సేతుఁ
చక్రంబు చేపట్టి నక్రంబు తలకొట్టి
విక్రమించిన యాదివేల్పవు నీవె.

క. అని కొనియాడుచు ప్రేమను
జనకుని యజ్ఞంబుఁ జూడఁ జనియెడువేడ్కఁ

జననాథసుతుల వేడ్కన్
జనుదేరఁగ మౌనివరుఁడు చయ్యన నరిగెన్.

వ. యిట్లు రామలక్ష్మణసహితంబుగా యారాత్రి శోణానదీతీరంబున నిద్రించి మరునాఁడు ప్రభాతంబున సంధ్యాదివిధులు దీర్చి చని గంగంగని రట యెటువలెను.

త్రిపద.

అంగజాయిత సంగ రంగన్నటభృంగ
సంగీత నిగమాంతరంగ నా గంగన్
తుంగహృద్రిపుభంగ భంగామలోత్తుంగ
మంగళాయుత మోహనాంగ నా గంగన్
అంగదాంగభుజంగ అంగీకృత విహంగ
రంగదరివిహారసారంగ నా గంగన్.

వ. అంతట గంగావతరణంబు జేసి గౌతమాశ్రమంబుం జేరం జని రట యెటువలెను.

త్రిపద.

దూరమున రఘునాయకుల పదధూళి సోఁకిన యంతమాత్రనె
కోరహల్యాదేవి శాపము దీరె నంతన్
పంచబాణునిబాణమో క్రొమ్మించుదీగెయొ పుష్పలతికెయొ
యెంచదగు నీమగువ యనఁగను యదుట నిలచెన్
చూచి యద్భుత మంది రాముఁడు సుదతిరూపము వింత యని ముని
చూచి కరములు మొగిచి పలికెను సోద్య మందన్
దేవ! యీవరకాంత యెవ్వరిదేవి రాయై వుండి యీగతి
భావజాతునిరాశియో యన పణతి యయ్యెన్
అనిన విని గౌతముని భార్య యహల్య దీనికి శాప మిచ్చెను
మునుపు గౌతముఁ డింద్రు నీసతి పొందు పెఱిఁగి
నీదుపాదరజంబుచే వర్ణింపఁదగియెడునాతి యయ్యెను
పాదరేణువు పొగడ దరమే బ్రహ్మకైనన్.

వ. అనిన నప్పుడు గౌతమాదులు మునిగణంబులును తద్గిరికందరంబుల సంచరించు చెంచితలు యా యహల్యం జూడ నరుగుదెంచి రట యెటువలెను.

జంపె.

గౌతమాత్రివ్యాస కణ్వనారదవత్స
శాతాతపాదిమునిసంఘంబు లెల్లఁ
జనుదెంచి రామభద్రుని చాల కీర్తించి
మునిపుంగవుని కౌశికునిఁ జూచి వేడ్కఁ
నీవు రాముని దెచ్చి నెమ్మితో నీవనిత
పావనంబుగఁ జేసి తౌనౌను మేలు.

వ. అని యమ్మునులు రామచంద్రుని మహాత్మ్యంబు పొగడుచుండ నాసమ యంబున చెంచితలు యాలలు పాడి రట యెటువలెను.

యాలలు.

మీనామై వారధి జొచ్చి దానవుని చేరి వచ్చి
వుని వేదా లజుని కియ్యావా - వో రాఘవేశా -
భానుకోటి తేజ మెప్పాగా.

పొంపుగా కూర్మమై చేరి మందారాద్రికిందా దూరి
అందముగా పైకి నెత్తావా - వో రాఘవేశా -
అంది సురలా కమృత మియ్యావా.

ధరణి చుట్టి చంక బెట్టి అరుగూ దానవుని గొట్టి
వారాహమై భూమి నెత్తావా - వో రాఘవేశా -
కరుణతో జాగాము గావావా.

మేటినాఖాములు పెంచి హాటకకశిపు ద్రుంచి
పాటించి ప్రహ్లాదు గావావా - వో రాఘవేశా -
మాటవాశి గలావా దొరా.

వామనారూపము దాల్చి భూమి యడుగున గొల్చి
ప్రేమ బలి గట్టి వేయవా - వో రాఘవేశా -
భీమముగా విక్రమించవా.

ఆజిలో రాజులా చెండి తేజాము మెరయ నుండి
వోజతో భృగురాముండవై - వో రాఘవేశా -
భూమిజనులు నుతి శాయగా.

చిన్నిబాలుండవై నేఁడు మున్నుఁగ మూకలా గూడు
కొన్న దానావూల దృంపావా - వో రాఘవేశా !
పన్నుగా యాగము గావావా.

కమ్మని కస్తూరి గూర్చి యెమ్మెగా నొసలా దీర్చి
కొమ్మలాను వలాపింపావా - వో రాఘవేశా -
తమ్మునితో గూడి తిరుగావా.

క. యాలలు పాడుచు రామన్న
పాలునిఁ గనుఁగొనుచు చెంచుబాలికెలు మదిఁ
గీలించిన మోహంబుల
తాలిమి దిగవిడిచి విరహతాపముఁ బొందిరి.

వ. అంత గౌతముండు సంతోషాంతరంగుండై అహల్యం గూడుకొని రామ లక్ష్మణుల దీవించి నిజనివాసంబునకుం జనియె ఋషులు తమతమ యాశ్రమంబులకుం బోయి రట విశ్వామిత్రుండు దాశరథులం గూడుకొని జనకుని పురంబునకు చేరం జనియె నప్పురం బెటువలె నున్నది.

త్రిపుద.

శ్రీకరంబులు పక్షిజాలవశీకరంబులు విమలజలర
త్నాకరంబులు పురములో కమలాకరములు
శ్రీపురంబులు నగరరమకును దాపురంబులు విబుధతరుణుల
కాపురంబులు చూడ నప్పురిగోపురములు
రంజనంబులు యంజనాచలభంజనంబులు నీలమేఘుని
రంజనంబులు పురములో గల కుంజరములు.

వ. మరి న్నేమని వర్ణింపుచున్నాఁడు.

జంపె.

హాటకాచల మైన పాటవంబున దాఁటు
మేటికదలిక పురిని ఘోటకము లొప్పెన్
కామినులఁ జూచి సురభామినులు తాము సరి
గా మనుచు భోజనము లేమరుచునుండెన్
సురగేహములును భూసురగేహములును పుర
వరగేహములును పురవరమునను నొప్పెన్.

వ. మరి న్నేమని కొనియాడుచున్నాఁడు.

అర్ధ చంద్రికలు.

అంగడులం గడు రంగు చెలంగన్
మణులును తరుణీమణులును గుణులున్
దైవజ్ఞులు దను భావజ్ఞులునున్
అన్నులు కన్నుల సన్నలు దెలుపన్
చిన్నిమోము లతిచెన్ను వహింపన్
పొగడుచుఁ బ్రియులను దెగడుచు నవ్వన్
చిగురొత్తఁగ నిగనిగని మెరుంగుల్
నిగుడఁగ గుబ్బల మృగమద మలఁది
వీథులవెంటను మాధుర్యముగన్
కులుకుచు దేనియ లొలుకుచుఁ బలుకన్
యతులు భ్రమశి కడు మతులు చెలింపన్
మదనుని మోహనమంత్రము లనఁగా
బుధలాలిత మగుమిథిలాపురమున్.

వ. యివ్విధంబున మణినికరమకరతోరణాలంకృతంబును పవనచలితకేతు వ్రాతకింకిణీ ఘనఘనాయమాన పటురవంబును కస్తూరికాలిప్త మౌక్తిక రంగవల్లీ విరాజిత గ్రహణ (గృహ ?) ప్రాంగణంబును నాథాంగరాశి సుందరీబృంద సంగీతనినదంబునుం గలిగి సకలసంపత్కరం బగు నప్పురంబు జొచ్చి రాజమార్గంబునం జని రట యెటువలెను.

అటతాళం.

గాధిసుతుఁ డతిముదమునను రాఘవులు దానూ పురవర
వీధి నరుగఁగఁ జూచి పౌరులు విస్మయమునఁగా
చారుదేహులు దీర్ఘబాహులు వీరవరులు వీరలఁ
గోరి సుతులుగఁ గనినసతి యేచారుమతియో
చెన్ను మీరిన ముద్దుమోములు కన్నుగవలూ జూచిన
కన్నతండ్రికి నెంత ప్రేమము కలుగు నొక్కో
అనుచు పౌరులు పలుకుమాటలు వినుచుఁ బోవా నంతట
జనకసుత సౌధంబు మీఁదను సఖులు దాను.

వ. యిట్లు విస్మితచిత్తయై చెలికత్తియలం జూచి రామభద్రుని సౌందర్యం బేమని వర్ణింపుచున్నది.

త్రిపుట.

దండుతనమున గండు మీఱి యఖండితములై మెండు మెరశిన
పుండరీకము లగుచు పదములు పొందు పడియెఁగా
కల్పశాఖలయొప్పు దెగడుచు కరికరంబుల దప్పు లెన్నుచు
పొల్పు మీరుచు నున్న దీతని భుజయుగంబుఁగా
నీలనీరదవర్ణ కాంతుల దీలుపఱచి మనోహరంబై
చాల మోహన మయ్యె నీ బలశాలిమూర్తి
యిట్టిరూపును యిట్టి చూపును నిట్టి చందము నిట్టి యందము
నెట్టియెడ నెందైన గంటిమె యితఁడు దక్కఁగా.

వ. అని మరి న్నేమనుచున్నది.

జంపె.

మారుఁడో రారాకుమారుఁడో సురరాకుమారుఁడో
యీరాకుమారుం డనియెంచఁగా
చంద్రుఁడో నలరాజచంద్రుఁడో వనరాజచంద్రుఁడో
యీరామచంద్రుం డనియెంచఁగా
చతురమతి నతికుతుకవతు లగుచు ప్రతిలేనియితని
బొందెడి సుదతు లతిపుణ్యవతులు.

వ. యివ్విధంబున జనకరాజనందన మందకందళిత హృదయారవిందయై తన చెలికత్తియలతో చెప్పుచుండ రాజమార్గంబునం జని చని రాజమందిరంబు ప్రవేశించునప్పుడు జనకుం డేవిధంబున కొలువై యున్నాఁడు.

అటతాళం.

కుకురకొంకణమత్స్యమాళవకుతలపతులూ వొకయెడా
మకుటకీలితరత్నకాంతులు మారు మసలఁగా
తర్క వేదాంతములు దెలుపుచు కోర్కె మీరా సన్నిధి
తాల్కికులు పౌరాణికులు సందడియ నొప్పఁగా
రాయభారులు గవులు మంత్రులు నాయకులునూ కెలఁకుల
పాయ కెప్పుడు నుండి కార్యవిభాగు లగుచుఁగా
పనిముఖంబులవార లిరుగడ నొనరనిలిచి చూడ్కులు
తనర ముఖమున నిల్చి కొల్తు రుదగ్రభీతిఁగా
రత్నసింహాసనముమీఁద ప్రయత్నమునసూ కొలువై
రత్నకీలితభూషణంబులు రమణ వెలుఁగఁగా
గానరవములతోడ కంకణకలరవంబూ పెనగొన
మానవతు లటు చేరి వింజామరలు వీవఁగా.

వ. యివ్విధంబున జనకమహారాజు కొలువై యున్న సమయంబున దవ్వారికులు వచ్చి యేమని విన్నవించిరి.

గీ. దేవ! గాధేయమౌని యేతెంచె ననుచు
విన్నవించిన లేచి యుర్వీధవుండు
యెదురుగా నేఁగి సాష్టాంగ మెరఁగి యర్ఘ్య
పాద్యము లొసంగి కొనివచ్చె భక్తితోడ.

వ. అర్ఘ్యపీఠంబునఁ గూర్చుండ నియమించి కుశలప్రశ్నంబు లడిగె నట యెటులనెను.

ద్వి. మునినాథ! మీతపంబునకు విఘ్నంబు
తనరఁ జేయరు గదా దానవాధములు
క్రూరమృగంబు లకుంఠితగతుల

చేరి మీయాశ్రమశీమకు వచ్చి
బాధ సేయవు గదా భవ్యయోగముల
సాధింతురే మునిసంఘంబు లెలమి
యిష్టకథాలీల నేప్రొద్దు దగిలి
శిష్టమానులు సుఖస్థితి నున్నవారె
యాగంబులకు విఘ్నంబులు లేక
సాగునే హోమముల్ సాగునే మరియు
నిత్యకర్మంబులు నిర్వహింపుదురె
సత్యాత్మ లగుమునిస్వాము లెల్లపుడు
అనిన మునీంద్రుఁ డి ట్లనియె రాజునకు
జననాథ! మీవంటి సద్ధర్మపరులు
ధరణి పాలింపంగ ధర్మమార్గమున
కొరఁత యే లగు మాకు కుశలంబె గాక
నీరాజ్యమునకును నీకు పుత్రులకు
వారక సేమమే వసుధీశ! యనుచు
పలికి యన్యోన్య సంభాషణంబులను
వొలుపు మీరఁగ ప్రొద్దు పుచ్చుచు నుండె.

వ. అంత జనకవిభుండు రామలక్ష్మణులం జూచి యీరాజకుమారు లెవ్వరని యడిగిన విశ్వామిత్రుం డే మనుచున్నాఁడు.

జంపె.

ప్రథితకీర్తుల వెంచి యధికశౌర్యత మించి
బుధులు మన్నించ దశరథరాజసుతులు
రాముండు నీయింట సోమధరు విల్లింట
ప్రేమమున కనుగొంటకై మెరశి వచ్చెఁగా
జనకుండు సంతోషజనకుఁడై మునిపతిని
కనుగొనుచు సమ్మదము కనుగొనల నిగుడఁగా
ఆవిల్లు మోపెట్ట చేవ మించినయట్టి
భూవల్లభుని మెత్తు-భూమిసుత నిత్తుఁగా.

వ. అని విల్లు దెప్పింప నుద్యోగపడు భూవల్లభుం జూచి మునివల్లభుండు నేటికి సంధ్యాకాల మగుచున్నది. రేపు చూతముగాకని వీడ్కొని రామ లక్ష్మణసహితుండై సంధ్యాదిక్రియలు నిర్వర్తింప నరిగె నంత తద్వృత్తాంతం బంతయు సీత చెలికత్తియలవలనను విని సంతోషితస్వాంత యయ్యె నంత సూర్యాస్తమ సమయం బయ్యె నట యెటువలెను.

త్రిపుట.

యెల్లి రాముఁడు విల్లు విరుచును తల్లడింపకుఁ డనుచు నురగుల
కెల్ల జెప్పగ బోవువిధమున నినుఁడు గ్రుంకెన్
నెట్టుకొని రవితీరు నడిఁ జని చెట్టు దాకిన నపరగిరిపతి
గట్టిగా నెత్తురులు గ్రక్కిన కరణి నొప్పెన్
అపరసంధ్యారాగ మప్పుడు విపులమై కనుపట్ట మౌనియు
నపుడు సంధ్యావిధులు దీర్చెను జపముతోడన్.

వ. అప్పుడు చుక్కలు వొడిచె నట యెటువలె నుండెను.

త్రిపుట.

గగన మనియెడివృక్ష మెల్లెడ గలయఁ బూచినవిధము దోఁపఁగ
నెగడె తారలు మింట కాంతులు నిగుడ నపుడు
కాలపురుషుఁ డజాండ మనియెడి కడవఁ బోశనీలిమం దన
లీల చీఁకటి యాక్రమించె విశాల మగుచున్.

వ. అట్టి కటికచీఁకటిని జారస్త్రీలు యేక్రమాన విహరింపుచున్నారు.

జంపె.

సారికలుఁ జేరి యభిసారికలు నాయకుల
జేరికలయిండ్ల కడు జేరికలఁ గూర్పన్
కలకంఠు లొకవెంట కలకంఠనాదముల
కులుకుచును నిజపతుల కళుకుచును భీతిన్
దూతికల గూడి సంకేతముల కేఁగి రతి
కౌతుకము లింపొలయ స్త్రీతతి సుఖింపన్.

వ. అంత చంద్రోదయం బయ్యె నట యెటువలెను.

త్రిపుట.

కమలశత్రుఁడు జలజపుత్రుఁడు విమలగాత్రుఁడు శుభచరిత్రుఁడు
కుముదమిత్రుఁడు దోఁచె తూర్పున ప్రమద మెసఁగఁ
జనకతనయకు రామవిభునకు బెనుప వలె మది ప్రేమ లనుచును
వానర వచ్చినమాడ్కి చంద్రుం డుదయ మయ్యెఁ
పండువెన్నెల గాయ కోవెల తండములు వడి గూయ విరహుల
గుండె లవియఁగఁ జేయ మదనుఁడు దండు వెడలెఁ
చిలుకవాపుర మెక్కి చక్కెరవిలు గుణధ్వని చేసి అలరుల
ములుకు వేశెను విరహి జనములు జలదరింపఁ.

వ. యిట్లు మన్మథుండు దాడి వెడలె నప్పుడు స్త్రీపురుషులు యేవిధంబునం గూడిరి.

ద్వి. అచ్చంపువెన్నెల యంగనాజనులు
విచ్చలవిడి గూడి విరహవేదనల
నలుకలు మాని రయంబునఁ బ్రియులఁ
గలపి మన్మథకళాకౌశలం బెసఁగ
నాటినప్రేమల నఖశిఖరముల
నాటించి కళ లంటి నవబంధభేద
రతుల నింపులు వుట్ట రమణులుఁ బ్రియులఁ
బ్రతి లేనిభోగసంపదలఁ బెంపెక్కి
భుజగముల్ బెనగొన్నపోల్కి నంగనలు
నిజవల్లభులఁ జేరి నెమ్మి కౌఁగిళ్ల
బెనచి కాలును కేలు పెనగొన్న చన్ను
మొనలు రొమ్మున నాట మోమును మోము
గదియించి సుఖరతిక్లాంతల గూడి
మది కింపు వుట్ట నెమ్మది నుండి రంత.

యిట్లు పిండి చల్లినవిధంబున నుండ నిండువెన్నెల బయట సీత రామభద్రు భద్రాకారంబు మనోవికారంబు గావింప నే మనుచున్నది.

అటతాళం.

మేడమీఁదటనుండి రాసుతు చూడ నేలా - మదనుఁడు -
గూడి పుష్పశరంబు వేయఁగ కుంద నేలా
రాముఁ డెన్నఁడు విల్లు విరుచును ప్రేమమీరా - యెన్నఁడు -
తామసింపక నన్నుఁ గలయును దయ దలిర్పఁగా
అనుచు తాపము మదిలొ నిలుబడి బెనుపుచుండఁగ - చంద్రుని -
కనలి చూచుచు కోపమున నాకాంత పలికెఁగా.

వ. అని చంద్రుని నేమని నిందింపుచున్నది.

ఝంపె.

యెల్లలోకులు నిన్ను చల్లనివాఁ డనఁగ
చెల్లఁబో నన్నింత శేయంగ దగునా
సరిగూడి విషముతొ జన్మించి తటు గాన
గుణ విరోధికి నీకు గుణ మేల కలుగుఁగా
వేమారుకామినుల వెతలఁ బెట్టెదునిన్ను
తామసుఁడై యొక్కఁగాము దినకున్నె
యింత యేచెడిపాప మింతటను బోవ దిక
వంతలై పదియారువ్రక్కలుగఁ జేయఁగా
లచ్చితోఁ బుట్టి హరి లాలింపఁ బెరిగితివి
మచ్చరము మామీఁద మాను మిక చంద్రా!

వ. అనిన చందనాచలమందానిలు నేమని నిందింపుచున్నది.

గీ. మలయపవనుఁడ! నీ వింక మసల వలదు
కాలసర్పంబు నిను బట్టి గదశి మ్రింగె
అంతటను బోక వడి తాళవృంతములను
పుట్టి లోకంబులను బాధ పుట్టఁ జేతు.

వ. అని మరియును మన్మథు నేమని నిందింపుచున్నది.

త్రిపుట

అంటినంతనె కందు తూపులు మంటతో సఖుఁడైన యరదము
తుంటవిల్లును నీకు నిది యొక బంటుతనమా -

గొంటుతనమున వోయి పురహరు కంటిమంటను రూపు మాలియు
వెంట దగిలెద వేల యింతుల కంటకమునా
అంగనల నలయించుపాపము సంగతంబుగ గూడి యిప్పుడు
అంగహీనుని జేసె నిన్నును అంగభవుడా!

వ. అని యిట్లు మన్మథుని నిందించి జానకి మరి న్నెటువలె నుండెను.

త్రిపుట.

సాంద్రచంద్రాతపము వేఁడిమి చండమదనుని యంపవేఁడిమి
చంద్రముఖి తాళంగఁ జాలక జాలి వొందెన్
విరహ మంతకు నగ్గలంబయి బెరుగుచుండఁగ నంగనామణి
కరకువెన్నెలలోన బడి వడి బొరలుచుండెన్.

వ. అంత చెలికత్తెలు తత్తరంబున చనుదెంచి సీతాకాంతవృత్తాంతం బంతయుం దెలిపి శిశిరోపచారంబులు జేసిరట యెటువలెను.

అర్ధ చంద్రికలు.

చందనగంధులు చందన మలఁదన్
అంబుజంబులు పదంబునఁ బొదువన్
చల్లఁగ పన్నీరు మెల్లనె చల్లన్
తాళవృంతములు తాళక వీవన్
కప్పురవీడెము మెప్పుగ నియ్యన్
చలువలు శేయఁగ చెలువకు మిగులన్
తాప మంతకును తరచై హెచ్చెన్
చెలులతో బలుకక నలయుచు నుండెన్.

వ. యివ్విధంబున చలువలు శేయ చెలువకు పరితాపంబు ఘనంబగుటయును యెరింగి అందు వొక్క ప్రౌంఢాంగన సీతాంగనతో నేమనుచున్నది.

అటతాళం.

తల్లి! యీగతి విరహవేదన బొర్లనేలా రాముడు
యెల్లి వేగమె విల్లు విరుచును నుల్ల మలరన్

ధనువు విరిచిన మెచ్చి యిచ్చును తరుణి నిన్నా జనకుడు
యినకులుండగు రామవిభునకు నెలమితోడను.

గీ. అంత కాంతలు చింతాకులాత్మ లగుచు
సీతc దోడ్కొని పోయి శయ్యాతలమున
నునిచి యెప్పుడు వేగునో యనుచు తూర్పు
చూచుచుండంగ వేగురుచుక్క పొడిచె.

వ. అంత ప్రభాతసమయం బయ్యె నట యెటువలెను.

ద్వి. మనువంశవిభుcడు రామక్ష్మాధిపుcడు
ధనువు విఱిచెనో లేదో తప్పక చూచి
చనుదెమ్మటంచు భాస్కరుc డంపె ననcగ
వినువీథి గనుపట్టె వేగురుచుక్క
పురుహూతుగజముఖంబున బూశినట్టి
పరపైన శిందూరపంకమో యనcగ
వుదయాద్రి యనియెడి యొక్కవృక్షమున
తుదశాఖ వెలుగుపల్లవమో యనంగ
సతతదానవరక్త సంపిక్తమైన
నతులితవిష్ణు రథాంగమో యనcగ
ఘనకాంతి యింద్రు నంగట వ్రేల గట్టు
పెనుపొంద లత్తుకబిల్లయో యనcగ
అల జయంతునితొట్ల నమరంగ గట్టు
బలువైన కెంపుల బంతియో యనcగ
తనవంశభవుcడైన దశరథాత్ముండు
పెనుపొంద విల్లెక్కు పెట్టుచున్నాcడు
యే నింక చూడcబోయెదననుకరణి
భానుండు పూర్వాద్రిపై దేజరిల్లె.

వ. అంత విశ్వామిత్రుండు రామలక్ష్మణసహితుండై సంధ్యాదిక్రియలు నిర్వర్తించి జనకుని నగరు ప్రవేశించె నంత జనకుండును సకలదేశాధీశ మంత్రిపురోహితామాత్యసహితుండై యెదురేcగి మునీవరుం దోడ్కొని

పోయి అర్ఘ్యాదివిధులం బూజించి యర్హపీఠంబున గూర్చుండ నియమించి తానును యథాప్రకారంబున గొలువై యుండె. రామలక్ష్మణులు విశ్వామిత్రు పార్శ్వంబునం గూర్చుండిరి. అంత గాధేయుండు రాజుం జూచి యే మనుచున్నాఁడు.

జంపె.

చంద్రశేఖరువిల్లు సరగఁ దేరఁగఁ బంపు
సాంద్రమతి యీరామచంద్రుండు చూడ॥
అనిన జనకుఁడు చాల మనమునకు బ్రియమార
తనమంత్రివరుల నందర చూచి పలికె॥
మందసముతోఁ గూడ మదనరిపు కార్ముకము
పొందుగాఁ దేరంగ బంచుఁడీ యనిన॥
బల్లిదులు పదివేలు బలయుతుల వెసఁ బంచి
విల్లు దెప్పించి రట విభుఁడున్న సభకు॥

వ. యిట్లు విల్లు దెచ్చి సభాస్థలి నిలిపిన జనకుండు నమ్మునితో నే మను చున్నాఁడు.

జంఫె.

ప్రియముతో నీవిల్లు దయ గల్గి శంకరుఁడు
రయము మెఱయఁగ దేవరాతునకు నిచ్చె॥
అది యాదిగా నుండు అనఘ యాధను విపుడు
పదిలముగ మాయింట ప్రఖ్యాత మగుచు॥
యీ కార్ముకము వంచి యెక్కు వెట్టినఁ జాలు
కాకుత్థ్సునకు నిత్తు నాకూఁతు సీత॥.

వ. అనుటయు రఘువీరుండు మునిపనుపునను మందసముం జేరం జని చాపంబు చూచె నట యెటువలెను.

త్రిపుట.

పడగ లన్నియు మునిచి విద్రకు బడినశేషునికరణి చాపము
విడువడ్డమై కనుపట్టె కాంతులు నిగుడుచుండ॥

కనకమణినికరముల కాంతులు కలయ బెరసి సురేంద్రకార్ముక
మనఁగ చూపర కెల్ల నద్భుతజనక మయ్యెꠄ
మాయపురములు గెలిచి యభవుఁడు మహితమేరుశరాసనం బిట
పాయ కుంచెనొ యనఁగ బంగరు చాయ లొప్పెꠄ.

వ. యివ్విధంబున నున్నవిల్లు చూచి రాఘవుం డేక్రమాన నందుకొనెను.

ద్వి. అప్పుడు రఘువీరుఁ డల్లన విల్లు
గప్పి యున్నట్టి యా గౌశన వుచ్చి
బహువర్ణ చిత్రవిభ్రాజిత జ్వాల
మహిలోరు కింకిణీ మాలికాయుక్త
విదితమౌక్తికకోటి విమలమాణిక్య
సదమలమధ్య విశాలసౌవర్ణ
కాంతి నొప్పారు నాకార్ముకోత్తమము
వింతగాఁ గైకొని వెస నెక్కువెట్టి
తటుగున నట గుణధ్వని చెలంగింప
పటపట దిక్కులు పగిలిన ట్లయ్యె
తెగ నిండ విలుదీసి దృఢముష్టి వదల
నగలి పేటెత్తి రయంబున నపుడు
భగ్గన విరిగె నాభర్గుని విల్లు
దిగ్గజంబులు మొగ్గె దివి యెల్ల వణఁకె
సాగరంబులు బారి సంక్షోభ మొందె
వాగీశుఁ డట పైచె వడి నక్షమాల
సురపతితోఁ గూడ సురగణం బెల్ల
నరిమురి భయవిహ్వలాత్మకు లైరి
జనకుఁ డత్యాశ్చర్య జనకుఁడై రామ
జననాథవరుఁ జూచి సంతోష మంది.

వ. విశ్వామిత్రునితో యే మనుచున్నాడు.

జంపె.

రామభూవిభునకును భూమిసుత నిచ్చితిని
తామసింపక ముహూర్తము చూడుఁ డింకన్
అని మంత్రివరులతో జననాథుఁ డి ట్లనియె
చని మీరు దశరథక్ష్మాపాలుఁకడకున్
శోభనము చెప్పి యాశుభమూర్తి దోడ్కొనుచు
వైభవంబున రాఁగ వలయు మీ రనినన్
తగ మంత్రివరులు నాజగధీశు పనుపునను
నిగుడి వేడుకఁ బోయి నృపుఁ గాంచి రెలమిన్.

వ. యిట్లు దశరథుని సముచితప్రకారంబునం గాంచి యతండు సేయు సంభావనలు గైకొని యేమని విన్నవింపుచున్నాఁడు.

త్రిపుద.

స్వామి! సీతనయుండు రాముఁడు చంద్రశేఖరువిల్లు విరిచిన
మామహీపతి మెచ్చి యిచ్చెను భూమి సుతను
మిమ్ము బెండ్లికి తోడితెమ్మని మమ్ము బంచిన వచ్చినారము
సమ్మదంబున వెడలు మిప్పుడు జాగు మాని
అనిన సంతసపూర మంతయు నంతరంగము నిండి వెడలెనో
యనఁగ కన్నుల సమ్మదాశ్రులు పెనగొనంగన్.

వ. అంత ప్రధానవర్గంబునం జూచి జనకునితో సంమంధమ్మునకుం దగుం గదా యని యడిగిన వార లనుమతింప చతురంగబలస్తోమంబుతో గదలె నట యెటువలెను.

అటతాళం.

గంధసింధురహయరథంబులు బంధురముగా నడవఁగ
బంధుయుతుఁ డగు దశరథక్ష్మాపతియు వెడలెన్
నేల యీనినభంగి బలములు లీల నడువన్ భేరులు
చాల మ్రోయఁగ తూర్యరవములు సంకులముగన్
భరతుఁడును శత్రుఘ్నుండును సంభ్రమముతోడన్ కెలఁకుల
కరుల నెక్కి చనంగ గొడుగులు తరచు నడవన్.

వ. యివ్విధంబున సర్వసన్నాహంబులు మెరశి మంత్రిపురోహితామాత్య సహితుండై మిథిలాపురంబు చేరం జని జంఘాలురం బంచిన వారలు నతిశీఘ్రంబున నరిగి జనకవిభునకు పంక్తిరథురాక యెరుంగించిన నతండు సముచితప్రకారంబున నెదుర్కొని తోడ్కొనిపోయి ఆస్థాన మంటపంబున గూర్చుండి దశరథుతో నేమనుచున్నాఁడు.

జంపె.

యినకులాధిప! నీవు చనుదెంచితిని గాన
ఘనత నేఁ జేయు భాగ్యము లెంచ దరమా
నీతోడి సమ్మంధి నైతి కృతకృత్యుండ
నైతి నని జనకుండు కౌతుకము మీరఁగా.

వ. అనిన దశరథు నభినం౽ంచు(?) వచ్చి అర్ఘ్యపీఠంబున గూర్చుండ నియమించి తానును నిజాసనాసీనులై రంత రామలక్ష్మణులు దశస్యందను నకు వందనం బాచరించిన యతండు గాఢాలింగనంబుం జేసి కూర్చుండ నియమించి నప్పుడు విశ్వామిత్రు(డు?) వసిష్ఠుం జూచి యేమనుచున్నాడు.

త్రిపుట.

అయ్య! మీరలు కార్యకర్తలు నాప్తులును బహుమానపాత్రులు
నెయ్యమున లగ్నంబు వేగమె నిశ్చయముగఁగా
తెలియ నానతి యిం డటన్నను తెలివి నొందినమోము లలరఁగ
పలికి రొకవాక్యంబుగా భూపాలుతోడఁగా
రోహిణీయుతుఁడై శశాంకుఁడు రూఢి పూర్ణత నున్నవాఁడు వి
వాహలగ్నము రేపు మంచిది వసుమతీశా!

ద్వి. అనిన సంతోషించి యమ్మహీవిభుఁడు
యినకులాధిపునకు యింపు సొం పలర
కురువింద మణిమయ కుడ్యభాగంబు
వరనీలజాలకావలి విరాజితము
చంద్రకాంతశిలా విశాలసౌధంబు
సాంద్రవజ్రకవాట చారుతోరణము

లాలితభద్ర సాలావనిస్తంభ
జాలవినిర్మిత సాలభంజకము
స్ఫటికశిలామణి ప్రాసాదశిఖర
ఘటితసౌవర్ణాబ్జ కలశరంజితము
స్తంభనిబద్ధ విజృంభలసహిత
రంభావినూత్న తోరణమండితంబు
తండుల ముద్గాజ్య దధిగుణ తైల
మండిత పుండ్రేక్షు మన్మథపనస
ఫలపూర్ణముగ నొప్పగుమందిరంబు
తలఁపు మీరగ విడిదల గా నమర్చి
అందు వసిష్ఠాదు లగుమహామునులు
సందడింపుచు ప్రవేశంబు సేయింప
సుతులతోఁ గూడి నుత్సుకత దీపింప
ప్రతి లేని యట్టి శోభనలీల నుండె.

వ. అంత పట్టణము శ్రింగార మేరీతి నొప్పెను.

త్రిపుట.

కలువడంబులు గట్టి వీథుల కమ్మకస్తురి చల్లి ముత్తియ
ములను మృగ్గులు దీర్చి చిత్తరువులను వ్రాశి
జీనిపట్లను మేలుక ట్లతిచిత్రలీలలఁ గట్టి యరఁటులు
మానుగాఁ బందిళ్లఁ గట్టిరి(రశి) నూనముగను
జల్లులును బంగారుసరిగెలు చాల నెడనెడ గట్టి మేరువు
లెల్ల యెడలను నిలిపి ముకరము లుల్లసిలఁగా.

వ. యిట్లు పట్టణాలంకారంబు శేయించి జనకుండు కుశధ్వజుని రావించి తద్వృత్తాంతం బంతయుం జెప్పి నానాదేశాధీశులను బిల్వం బనిచి యమ్మరునాడు దశరథు రావించి కుశధ్వజుని కూఁతుల భరతలక్ష్మణ శత్రుఘ్నులకు నిచ్చెదనని దశరథు వీడుకొలిపి ముహూర్తంబు సాగించి రట యెటువలెను.

త్రిపుద.

సూర్యుఁ డస్తాచలము చేరఁగ చూచి గణపతిపూజ శేయుచు
చేరి ఘడియారంబు వెట్టిరి కోరి ద్విజులు
భేరులును దూర్యముల రవములు బోరు కలఁగఁగ దశరథుండును
చేరి సుతులను బెండ్లి కొడుకులఁ జేయుఁ డనినన్
భద్రపీఠముమీద పణఁతులు పశిని చెరఁగుల చీర బరచిన
భద్రముగ గూర్చుండె రాముఁడు భాసురముగాన్.

గీ. అంత సతులు మదుట నక్షతంబులు వెట్టి
దీవనలును వెలయ దివ్యగంధ
బంధురంబు మీరు గంధంబుచేతను
నలుగు వెట్టుచుండ లలన లెలమి.

అటతాళం.

నూత్నవాసితమైన సంపఁగినూనె దెచ్చి యంటెను
రత్నకంకణరవముతో నొక రాజవదనా
కమలములపైఁ దాఁటుతేఁటుల గమియుఁ బోలె కేశము
లమర నామలకంబు వెట్టెను కమలనయనా
వాఁడిగోళ్లను దువ్వి వేరొక వాలుగంటి రాఘవు
వేఁడిపన్నిట జలక మార్చెను వింతగతులా
చలువవెన్నెలకాంతి గలవస్త్రమును నొక్కా శశిముఖి
మెలపుతో తళ్లొత్తె రాముని మేన నెల్లన్
అంగనామణి యొకతె వెస కనకాంబరంబు తెచ్చిన
రంగు మీరఁగ గట్టె కటితటి రాఘవుండు.

ద్వి. కాంతాలలామ నొక్కతె(?) చేతాళ
వృంతంబు వీవంగ వెస జిక్కు వుచ్చి
సొగసుగా శిగవేశి సురుచిరప్రభలు
నిగుడ మాణిక్యముల నీలవజ్రములు
గారుత్మతానేక ఘనమణినికర

పూరితంబై పరిస్ఫుట కోటిసూర్య
భాసురంబై యొప్పు బలుకిరీటంబు
రాశికెక్కఁ ధరించి రామభూవిభుఁడు
తీరుగా నెలవంక తిరుమణి దీర్చి
మీరు కర్పూర సమేళనం బైన
కుంకుమపువ్వుతోఁ గూర్చి శ్రీఖండ
పంకుమదంబులు సరి మేన నలఁది
హురుమంజి ముత్యాల యొంట్లు ధరించి
సరిపెసల సవరించి సరి కంఠమాల
ధరియించి సందిట తాయిత్తు లమర
రంగుమీరిన కాంతి రత్నముల్ వెలుఁగ
వుంగరంబులు వెట్టి యొప్పు దీపింప
శతకోటిమన్మథసౌందర్యలీల
నతిశోభనాకారుఁడై యుండె నంత.

వ. అంత నక్కడ సీతాదేవికి మంగళస్నానంబు శేయించి రట యెటువలెను.

త్రిపుట.

అరఁటిపండ్లును పువ్వులును గంధాక్షతంబులు వక్కలాకులు
మెరయుపసుపును నూనెయును కాశ్మీరరజముఁగా
తెచ్చి యచ్చరలేమలో యన పెచ్చు పెరుగుచు మచ్చెకంటులు
వాచ్చె మింతయు లేవి సీతను తెచ్చి వేగఁగా
పెండ్లికూఁతురు జేయ కాంతలు ప్రేమ లినుమడి గొనినవేడుక
పెండ్లిపీఁట యమర్చి యునిచిరి ప్రియము మీరఁగా
గానరవములు మీరగా నొకమానినీమణి చేరి సంపెఁగ
నూనె యంటెను కుచము లొరయ మనోహరముగఁగా
గంధములు కస్తూరి కుంకుమ కలయ కూర్చి హరిద్రయుతముగ
మందగమనలు నలుఁగు వెట్టిరి మందగరిమెఁగా.

వ. అప్పుడు స్త్రీలు కొట్టములు దంచి రట యెటువలెను.

సువ్వాల.

మందగమన! పాడవే మాళ వాలపించి యిపుడు
సుందరాంగితోడ నీవు జోడు గూడుకా
సువ్వి జనకతనయ సువ్వి సువ్వి లోకమాత సువ్వి
సువ్వి చంద్రవదన సువ్వి సువ్వలావే
అంగనాలలామ గూడి సంగతముగ రాగసరణి
రంగు మీర బాడవే కురంగనయనరో!
బాహుమూలరుచులు మించు పణఁతు లెల్ల భుజము లెత్తి
మోహనంబు మీర గొట్నములను దంచిరి
నాతి యాళపించి పాడు నాట నేఁడు వేడు కలర
నీతి గాదు నాతోడ జాతు లేటికి?
దంతకాంతి యధరకాంతి వింత శేయ సంతసమున
యింతు లెల్ల నెరెడు లెలమి బాడుచు
శోభనంబు శోభనంబు శోభనంబు నెలకు మూఁడు
శోభనంబు లనుచుఁ బ్రాలు సుదతు లెత్తిరి.

వ. యివ్విధంబున స్త్రీలు కొట్నము దంచి యనంతరంబ మంగళహారతు లెత్తి
రట యెటువలెను.

అర్ధ చంద్రికలు.

నెలఁత యొక్కతె పెన్నెరిముడి విప్పెఁగా
మగువ యొక్కతె యామలకము వెట్టెఁగా
లలన యొక్కతె పెస ఉలకం బార్చెఁగా
వన్నెగ నొకసతి వలిపెము దెచ్చెఁగా
తడయక వొకచెలి తడి వడి యొత్తెఁగా.

వ. మరిన్ని జానకి నేవిధంబున నలంకరించిరి.

ఝంపె.

భామ యొక్కడె వేగ పట్టుపుట్టము దెచ్చి
భూమిజకు గట్టె నేర్పున సతుల్ మెచ్చఁగా

ముఖసరోజంబునకు ముసరుతేంట్లో యనఁగ
సఖికురులతడి యార్చె చంద్రముఖి యొకతె
జీనిదువ్వెన దువ్వి చెలువముగ గొప్పిడి
మానవతి యొకతె సమ్మదము రెట్టింపఁగా
పచ్చికస్తురి దెచ్చి పన్నీటి పదనిచ్చి
యచ్చుగా తిలక మిడి రంగనకు నొసలఁగా
రాయంచనడలు సరిరా వనుచు మొరవెట్టు
చాయ నందెలు పాదసరణి నొప్పారెఁగా.

అటతాళం.

తనకు వెలి లోకమునఁ బురుషార్థంబు లేదూ జనులకు
ననుచుఁ జెప్పెడికరణి కింకిణు లంటె మ్రోయఁగా
కనకమణినికరములదీప్తులు గడలుకొనఁగా కాంతులు
మీరి కుచముల పాండువర్ణము గారవింపఁగా
కాంతు లీనెడినట్టిపొంజుల కమ్మ లొప్పెఁగా చెవులను
వింతగా ధరియించి జనులకు సంతసముగాఁగా
వుంగరంబులు కటకములు గేయూరములును జానకి
రంగు మీరఁగ దాల్చినప్పుడు రాజసమునఁగా
విధుఁడు ముందర నిడిన నొప్పెడిబుధుఁడువోలె ముంగర
ప్రథితమై కనుపట్టె చూడఁగ రాజముఖికి.

గీ. యిట్లు శృంగారములు దాల్చి యెలమి నుండి
నిలువుటద్దంబు గొనివచ్చె నెలఁత యొకతె
యెదుట నిలిపినఁ జూచి మహీతనూజ
సిగ్గుపెంపును హర్షంబు నగ్గలముగా.

వ. యివ్విధంబున నలంకృత యైన సీతం జూచి చెలువ లేమనీ వర్ణింపు చున్నారు.

జంపె.

అరవిందముల కెందుపలచి తలిరుల గెలిచి
కురువిందముల పొందు తరుణి పాదములు

బాణహీనత నొందు తూణీర యుగళంబు
యేణాక్షిజంఘలకు నెట్లు సరి వచ్చుఁ
మరుదాప్తిచే చాల బొరలెత్తు కదళికా
తరువులే సాటి తరుణి యూరులకు
కర్కశత్వము మించు కరిమస్తకము సరియె
తర్కించి చూడ నీతరుణిపిరుదునకు.

వ. మరి న్నేమని వర్ణింపుచున్నారు.

త్రిపుట.

నాభివివరము వెడలి చనియెడి నాగవిభుఁడో నాగ యింతికి
శోభితంబై యారు చక్కఁగఁ జూడ నొప్పెఁ
కమలముకుళము లజుఁడు మును కుచకలశములు గావించి పిమ్మట
భ్రమరి ముఖమున చంద్రు నునిచెనొ బాల కనుచుఁ
కనకవలయవిహీనముల పంకమునఁ బుట్టిన కర్కశంబులు
వనితకరముల కెట్లు బిసములు వచ్చు సాటి.

యెకతాళి.

కన్నులకును సరి గా మని వెరపున మున్నుగ జలముల మునిగెను మీనుల్
దాడిమబీజము వీ దనఁ దగు నీ చేడియ రదనరంజితపంక్తికిని
కన్నియ భ్రూలత లెన్నఁగ నొప్పెను తిన్ననిమరుఁ డెత్తినవిం డ్లనఁగఁ
యీకామినినెరి కెనగామని మది నాకనమునకై యరిగె ఘనంబుల్.

ద్వి. అని యిట్లు సౌందర్య మభినుతి చేసి
జనకజఁ గై సేసి సంభ్రమింపఁగను
అంత నక్కడ లగ్న మాసన్న మాయ
వింతగా గైశేశి వేంచేయుఁ డనుచు
దశరథునకుఁ జెప్పి తనయులుఁ దాను
విశదభూషణములు వెలయంగఁ దాల్చి

భేరీరవంబులు పృథుల శంఖములు
భూరితూర్యంబు లద్భుతముగా మ్రోయ
ఫలకుసుమాది శోభనపదార్థములు
కలితకర్పూరాది గంధవస్తువులు
భూషణవస్త్రముల్ పొలుపారఁ గొనుచు
యోషాలలామంబు లొగి మును నడవ
వుదయాద్రిపై నెక్కు వుడురాజుకరణి
కదిశి రాఘవుఁడు భద్రగజముపై నెక్కి
తనతమ్ము లిరువంక తగుకరు లెక్కి
జనుదేర నడచె నుత్సవము దీపింప
బంగారు పల్లకిపై నెక్కి వెనుక
రంగు మీరఁగ దశరథరాజు నడవ
వందిమాగధులు కైవారముల్ శేయ
సందడి వేత్రముల్ జడియుచు రాఁగ
కరదీపసమితి లక్షలకు మిక్కిలిగ
తరచుగాఁ బట్టి చంద్రజ్యోతి నెలమి
వరుసతోడుత నిరువంకలఁ బట్టి
పరువడి నట పట్టపగలింటికరణి
కరమొప్పు రాజమార్గంబున నడచు
తరిఁ జేరి పౌరకాంతలు సంభ్రమించి.

వ. అప్పుడు పౌరకాంతలు రఘునాయకుం జూడవచ్చేక్రమం బేక్రమానను.

అటతాళం.

సగము తిరుమణి దీర్చి యద్దము చక్క నుండఁగా వచ్చెను
మగువ యొక్కతె రామవిభుఁ బ్రేమమునఁ జూడఁగా
తారహారము మేఖలంబును తడబడంగా దాలిచి
వారిజానన రాముఁ జూడఁగ వచ్చె వేగఁగా
పడఁతి యొక్కతె యరిగి కుచముల బరువుచేతా వేగమ
నడవ నేరక నిలిచి చెలువలు నవ్వ తెగడఁగా.

వ. యిట్లు పౌరకాంతలు రమ్యహర్మ్యతలంబుల నిలిచి లాజాక్షతలు చల్లి దీవెన లొసంగ సమ్మర్దమందగమనంబున రాజమందిరంబు చేరం జని కక్ష్యాంతరంబులు గడచి గజావతరణంబు శేశి పశిని పావలు దొడిగి నడవ ముందర వసిష్ఠాది పురోహితులు స్వస్తివాచకపూర్వకంబుగా నడవం జని చతుస్తంభసంభృతరంభాస్తంభశోభితంబును మణిదీపమాలికాలంకృతంబు చతుర్ద్వారసోపానరమ్యంబు నదుకూలచితానక కలుహారమాలికా ముకుర ప్రతిబింబమాన వలమాన వలభిప్రదేశంబును నగు వివాహవేదికా మధ్య ప్రదేశంబున శశికాంతమణిఖచితపీఠికయం దాశీనుండయ్యె నప్పు డేత్రమానను.

త్రిపుద.

కనకకలశములం దగ నుదకములు దెచ్చిన రామవిభునకు
జనకభూపతి గడిగె పాదాబ్జములు ప్రేమః
అర్క్యవంశాంబుధిశశాంకున కమరు గుడదధి సహితముగ మధు
పర్కమిచ్చెను రాజు లెల్లను ప్రస్తుతింపః
తామసించగ నేల లగ్నము తారసించె నటంచుఁ బలుకఁగ
భూమిసుతఁ దోడ్తేర జనులను బుచ్చె విభుఁడు.

వ. అప్పుడు జనకనందన యేత్రమాన వచ్చెను.

జంపెరేకులు.

మేఘమండలి వెడలి యవనికి మెరయు మెరుగూ దీఁగెయొ ఆహా
లాఘవం బెడలించి వెడలిన లలితమందిరలక్ష్మియో
నటన లభ్యాసంబు శేయుచు నడచి చనురాయంచయో ఆహా
పటుతరం బగుచున్న మన్మథు భవ్యమోహనబాణమో
అవనిజనులను బ్రోవఁ దలఁచిన యమృతరసముల తేటయో ఆహా
నవమనోహరకాంతి గల రత్నంబుమొలకల దిన్నెయో
ప్రకట దివ్యనూత్నపరిమళ భాతి గల పూఁదీఁగెయొ ఆహా
సకలగుణములు గలిగి వెలశిన చారుపుత్తడి బొమ్మయో.

వ. యిట్లు సౌందర్యంబు మెరశి సఖిజనానునయాలాపప్రయత్నయై వివాహ వేదికకు చనుదెంచి పళినిపచ్ఛడంబు తెరచాటున నిలిచిన జనకుండు సంకల్ప పూర్వకంబుగా కన్యాదానంబు చేశె నంత సుముహూర్తంబున దెర యెత్తిరట యెటువలెను.

త్రిపద.

తరుణిమాపులు రామవిభుపదసరసిజంబుల వ్రాలి యవ్వలి
కరుగ నేరక నిలిచె తుమ్మెద లగుటకతనన్
భూమినాయకు దృష్టి కామినిముఖసరోజమునందు సుడివడి
భ్రామరీకుల మంబుజమునకుఁ బారుకరణిన్.

వ. యి ట్లన్యోన్యముఖసందర్శనానంతరంబున అరుంధతీ యనసూయలు ధవళంబు పాడి రట యెటువలెను.

ధవళం.

శ్రీకర జగదభిరామ ప్రాకటరుచిస్తోమ
భీకరశత్రువిరామ కాకుత్థాన్వయరామ
విశ్వామిత్రుని యాగము శాశ్వతముగ జేయించి
శశ్వత్కీర్తుల వెలసిన విశ్వాత్మక శ్రీరామా
కనకాంబరములు వెలయఁగ సనకాదులు వినుతింపా
వినతాతనయుఁడు వెలుఁగఁగ పెనుపొందిన శ్రీరామా
చక్కనివారిలొ మిక్కిలి చక్కనినాయకుఁ డనుచు
దిక్కుల నిను కీర్తింతురు మిక్కుటముగ శ్రీరామా
కమలాసనుఁడు నుతింపఁగ కమలాసహితముగాను
కమనీయాతధరంబున కమలోదర శ్రీరామా
రాజీవంబులు దెగడెడు రాజితనయనము లొప్పా
రాజద్గుణములు వెలశిన రాజానన శ్రీరామా.

వ. యివ్విధంబున దత్కాలోచితసమాచారంబులు జేసి రట యెటువలెను.

త్రిపుట.

మునులు దీవెన లొసఁగి యియ్యఁగ వనజనేత్రుఁడు సీతగళమున
మనిచె మంగళసూత్రము(మం ?) నంగన లోలి నవ్వన్

రామసీతల కపుడు తగ తలఁబ్రాలుఁ బోయఁగ మౌక్తికంబులు
రామ లిరువంకలను బట్టిరి రాజసమునన్
పగడములరుచి దెగడు నాదంపతుల దోయిట ముత్తియంబులు
మగువ లునిచిరి బ్రాహ్మణుల యనుమతముతోడన్
రాముఁ డంతట సీతశిరసున బ్రాలు నించెను రాగయుతముగ
తామసించక తమ కులాగమ ధర్మమునను
భామ లందరు చేరి కరములు బట్టి యెత్తిన సీత శీఘ్రన
రామభూవిభు శిరసుపై తలఁబ్రాలు బోసెన్
హస్తమస్తకదేహకాంతులు నంటి మౌక్తికరాశి యొప్పెను
ప్రస్తుతింప ననేక మగు వర్ణములతోడన్.

వ. తదవసరంబునం జెలులు చిటికిన వచ్చిన వధూవరులు మణిపీఠంబున సుఖాసీనులై రంత జనకుండు వసిష్ఠానుమతంబున భరతలక్ష్మణశత్రుఘ్నులకుం గ్రమంబున మాళవి యూర్మిళ శతకీర్తు లను కన్యకలం బాణిగ్రహణంబు చేయించె నంతట భూసురాంగనలు శోభనంబు పాడి రట యెటువలెను.

శోభనం.

కరుణాంతనేత్రునకు కమనీయగాత్రునికి
పరమాపవిత్రునకు పరశురామునికి ॥ శోభనామె ॥
అలినీలావేణికిని అంబూజాపాణికిని
నలినోదరురాణికిని నాతిసీతకును ॥ శోభనామె ॥
ఆజానుబాహునికి అంబుజాదేహునికి
రాజితభద్రునికి రామాభద్రునికి
వారిజనేత్రికిని వసుమతీపుత్రికిని
శ్రీరాజితగాత్రికిని సీతాదేవికిని.

వ. అంత హోమం బేక్రమాన నేయించుచున్నాఁడు.

జంపె.

యజ్ఞపురుషుని దేర వేగమునఁ బంచి
తజ్ఞు లెంచఁగ హోమతంత్రంబు నడపెన్ •

లాజహోమము జేసి తేజమెసఁగఁగ నగ్ని
పూజ గావించె నాభూవిభుండంతఁ
కడఁగి భూపతు లెల్ల కట్నములు చదివింప
కడఁకతో జనకభూకాంతుఁ డావేళఁ
వొకలక్ష తురగంబు వొకలక్ష గజములును
వొకలక్ష రథములును వొప్పుగా నిచ్చెఁ
పేరు గలయవి గాఁగ నూరుగ్రామము లిచ్చె
చారుభూషణవస్త్ర జాలంబు లిచ్చెఁ.

వ. యిట్లు అల్లునకు కూఁతులకు వేరువేర నరణం బిచ్చి యనంతరంబ మంగళహారతు లెత్తి రట యెటువలెను.

మంగళం.

ధారుణీభర్తకు దశరథసుతునకు మారామవిభునకు మంగళం
కోరినవరములు గురుతుగ నిచ్చేడి మారజనకునికి మంగళం
మంగళం మంగళం మాపతికి మంగళం శ్రీరామ మహీపతికి
సుందరతనునికి సుగునాకరునికి మంగళం మందరాధరునకు మంగళం
విం దైె విభవము వెలయఁగ విదురుని మందిర యీయికి మంగళం
అఘనాశనునికి యాదిదేవునికిని మఘవానుజానికి మంగళం
రఘువర కాకుత్థ్సరామచంద్రునికి మఘరక్షకునికి మంగళం.

గీ. శోభనం బతిలక్షణశోభితముగ
నాలుదినములు చెల్లిన నాగవల్లి
చేశి జనకుండు సంతోషచిత్తుఁ డగుచు
తగువిధంబున ఋషుల నందరను నసిచి.

వ. అంత జనకదశరథులు విశ్వామిత్రునకు దండప్రమాణామంబు లాచరించిన వారల దీవించి రామలక్ష్మణుల కౌఁగిటం జేర్చి, అనేకవిధంబుల స్తుతియించి సకలమునిగణంబులతో వుత్తరాచలంబున కరిగె వివాహమహోత్సవంబు చూడవచ్చినరాజుల నంపె నది యెటువలెను.

ద్వి. శోభనాగతరాజసుతుల నందరకు
వైభవంబుగ కట్టువర్గంబు లిచ్చి
సవినయంబున నంపె జననాయకుండు
కవివరులకు తగు కట్నంబు లిచ్చి
వందిమాగధహాస్యవర్గంబులకును
పొందుగా మణివస్త్రభూషణావళుల
వలయు రీతుల నిచ్చి వారల ననిచి
వలనొప్ప దశరథేశ్వరునకు నపుడు
మణిభూషణంబులు మహితాంబరములు
గణనకు నెక్కుడు గాఁగ నొసంగి
పయనంబునకు తగు పరిచారకులను
నియమించి యా ధరణీతలేశుండు
గారవంబున సీతఁ గౌఁగిటఁ జేర్చి
వారక గద్గదస్వనముతోఁ బలికె.

త్రిపుట.

తల్లి నీపతి లోకమాన్యుఁడు ధర్మశీలుఁడు సత్యసంధుఁడు
యెల్లగుణములు గలిగి వెలసిన యహీనబలుఁడు
చింత యావంతయును వలవదు శ్రీరఘూద్వహుఁ జేరి సేవలు
సంతతంబును జేశి కీర్తులు సంతరించు
అత్తమామల సేవఁ జేసిన నమరు నిహపరసాధకంబులు
తత్తరించక వారిప్రేమల దనుప వమ్మ.

వ. అని బుజ్జగించి కూఁతులకు ననేకవిధంబుల బుద్ధులుం జెప్పి వీడుకొలిపె తదనంతరంబ.

జంపె.

పట్టెమంచము పరపు బంగారు బొమ్మలును
పెట్టెలును సొమ్ములును పెద్దనవరములును

బంగారు తంబిగెలు పశిని కాళాంజియు
భృంగారుకములు నొప్పెడి చామరములు
అకలంక జీని జీనాంబరంబులు చాల
శుకపంజరములు నాసురపీఠికములు
వరరూపు గలయట్టి వరువుళ్ల నొకలక్ష
కరము సంప్రీతి చక్కనివారి నిచ్చె.

వ. యివ్విధంబున సకలవస్తుజాలంబులను సమకట్టి తగువారలం గూర్చి అనిపె నంత దశరథుండు ప్రధానవర్గంబును దానును కట్టాయితంబైన ప్రస్థానభేరి చరువంబంచి పణవాదితూర్యరావంబులు దిక్కుల పిక్కటిల్ల భూసురాశీర్వాదంబులు చెలంగ శుభముహూర్తంబునం గదలి భద్రగజారూఢులై రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు చనుదేర పల్లకులవెంట నాప్తభృత్యవర్గంబు చనుదేర మిథిలానగరంబు వెడలి యయోధ్యానగర మార్గంబునం జనునప్పుడు పరశురాముండు వచ్చెనట యెటువలెను.

ద్వి. ఘనజటాభారంబు కంపింప మేను
వనజాప్తకంబెను వడి ప్రకాశింప
ఉరుతరకోపమహోగ్రత కన్ను
లరుణకాంతుల నీన నతిరభసమున
ఖండేందు దెగడెడుకాంతులు గలుగు
గంద్ర(డ?)గొడ్డలి భుజార్గళమందు నునిచి
తులలేనికాంతి విద్యుద్దండ మనఁగ
పొలుచుకోదండంబు భుజమునఁ దాల్చి
భయమున శేనాధిపతు లొదుగంగ
జయజయధ్వనులతో సైన్యముల్ మ్రొక్క
భీమరూపంబున పెంపొందు పరశు
రాముండు చనుదెంచి రఘురామునెదుట
నిలిచిన కరి డిగ్గి నీలవర్ణుండు
తలవంచి మౌనికి దండంబు వెట్టి

ముకుళితహస్తుఁడై ముందర నిలువ
అకలంకతేజుఁడై అనియె భార్గవుఁడు.

**త్రిపుట.**

మొక్కినను బో విడుతునే నిను మొక్కపుచ్చక రణములోపల
చిక్కితివి నాచేత నెవ్వరు దిక్కు నీకుఁడా
హరుని చాపముతో సమానం బగుచు నీకోదండ మొప్పును
సురుచిరంబుగ నెక్కువెట్టుము చూత మనినఁడా
కోపవేగముతోడ రాముఁడు చాప మెక్కిడి యంబు తొడిగిన
తాప మొందుచు భార్గవుండు ప్రార్థనముఁ జేసెఁడా.

**దండకం.**

శ్రీమన్మహారాజ రాజత్కిరీటస్థ రత్నప్రభారంజితాంఘ్రిద్వయీ దుష్టసంహారముఁడా శిష్టసంరక్షయుఁడా జేయ జాయఁగాఁ గౌరి ధారుణి బుట్టి చెన్నొందు నయ్యాదిదేవుండవు న్నీవె నిన్నేఁ బ్రశంసింపఁగా నెంత వాఁడఁడా దయాంభోనిధీ నన్ను రక్షింపవే లోకనాథా రమానాథ కారుణ్య పాత్రా సురారాతిజైత్రా సితాంభోజనేత్రా నమస్తే నమస్తే నమస్తే.

వ. యివ్విధంబున స్తుతియించి భార్గవరాముండు మహేంద్రాచలంబున కరిగె అంత దేవత లాకాశమార్గమున నిలిచి రట యెటువలెను.

**అటతాళం.**

సురలు సిద్ధులు సాధ్యులును యక్షులును చేరి కొలువఁగ
సురవిభుం డరుదెంచె రామునిఁ జూచువేడఁడా
దిక్కు లేలెడురాజు లెల్లను తేజ మెసఁగఁడా వచ్చిరి
గ్రక్కునను శ్రీరామచంద్రుని కనుఁగొనంగఁడా
ప్రమథగణములు గొల్వఁగా వృషభంబు నెక్కి వచ్చెను
రమణిఁ బార్వతిఁ గూడి యభవుఁడు రాముఁ జూ
వాణియుతుఁడై హంసరాజును వరుస నెక్కి వచ్చెను
త్రాణ మించఁగ కమలభవుఁడును రాముఁ జూడఁడా.

వ. యివ్విధంబున సకలలోకపాలకులును వచ్చి రఘుపతిమీఁద పుష్పవృష్టి గురియించిరి. సురదుందుభులు మ్రోశె అప్సరస్త్రీలు నృత్యంబులు చేసిరి నంత భేరీపణవాదితూర్యంబులు చెలంగ సేనాసమేతంబుగా మహోత్సవం బున రామభద్రుం డయోధ్యానగరమార్గంబు ప్రవేశించె నప్పు డెటువలె నుండెను.

యేకతాళి.

మేడలఁ జేడె(డ ?)లు గూడుక శాసలు వేడుకఁ జల్లగ వీథులవెంటన్
నగరికిఁ జని యున్నతమగు కరి డిగి తగువిధముల నంతఃపురమునకున్
నీరాజనముల కోరిక నియ్యఁగ వారక సీతావల్లభుఁ డంతన్
తల్లుల కెల్లను దండముఁ బెట్టిన వుల్లము కడు రంజిల్లఁగ వారల్
గారవమున సుతు కౌఁగిట నొయ్యన చేరి దీవించిరి బహుగతులన్
జనకజయును మ్రొక్కిన దీవించిరి మనమున హర్షముఁ బెనఁగొనుచుండన్.

వ. తదనంతరంబ భరతలక్ష్మణశత్రుఘ్నులు మాళవి యూర్మిళ శతకీర్తులు దండప్రణామంబు లాచరించిన నందరకు దీవెన లొసంగ నంత సంతోషిత స్వాంతులై వుండి రంతా.

గీ. ధర్మమార్గంబు దప్పక ధరణి గల్గు
ప్రజలఁ బాలించి మిగుల సంపదలఁ బొదలి
సుతులు దానును భోగసుస్థితులు గలిగి
మహిమ బెంపొంద దశరథక్ష్మావిభుండు.

ద్వి. అని సర్వమునిదేవతారాధ్యు పేర
ఘనమేచకాప్రశం(భ్రసం ?) కాశుని పేర
నంకితంబుగ జేసె నమ్మ సత్కీర్తి
పంకజాహితవంశ పావనోత్తముఁడు
గురుమతి గొట్టుముక్కల కులోన్నతుఁడు
వరదభూపాలుని వరకుమారకుఁడు
ధీరుండు వెంకటాధిపుని సోదరుఁడు

చారుమోహనుఁడు కృష్ణమరాజసుకవి
వరలీల సీతామనోహరుపేర
కరమొప్ప నీయక్షగానంబు చెప్పె
యెం(యం?)త పర్యంతంబు నీధాత్రి యుండు
యెం(యం?)త పర్యంతంబు వినచంద్రు లుండు
నెంతపర్యంతంబు నీతార లుండు
నెంతపర్యంతంబు నీవార్ధు లుండు
నెంతపర్యంతంబు నీమేరు వుండు
నెంతపర్యంతంబు నీశేషుఁ డుండు
నెంతపర్యంతంబు నీదిశ లుండు
నంతపర్యంతంబు నవని నీచరిత
చింతితఫలదమై చెలువొందుచుండు.

శ్రీరామచంద్రాయ నమః

కరకృత మపరాధం క్షంతు మర్హంతి సంతః.

రాజపాళయం రాజకవుల
యక్షగానములు

౨

# పారిజాతాపహరణం

గోటుముక్కల సింగరాజు

శ్రీ

శుభమస్తు

అవిఘ్నమస్తు

# పారిజాతాపహరణం

శ్రీ సీతారమణీ పయోధరలస త్సిందూర పంకాంక వ
క్షో సౌందర్య విలాసలాలన కలా ... ... రద్రత్ననం
భాసాలంకృతుఁడై తనర్చి జగముల్ పాలించి లాలించు నా
కౌసల్యాత్మజుఁ డైనరాముఁ డొసంగుఁగా కల్యాణసాకల్యముల్.

అర్ధ చంద్రికలు.

చతురాస్యుని మదిఁ జతురతఁ గొలుతుఁగా
శంకరు భక్తవశంకరుఁ దలఁతుఁగా
గణనాథుని దిగ్గన గణుతింతుఁగా
ఇందిర నెంతు మదిం చిర మొప్పఁగా
చారుమతిఁగా నాచ్చారమఁ గొలుతుఁగా
వాణిని నంతర్వాణిని నెంతుఁగా
గౌరిని ఘనశృంగారి నుతింతుఁగా.

వ. మరి న్నెటువలెను.

సీ. వాల్మీకిమౌనికిఁ గేల్మోడ్చి శ్రీపరా
శరసూనుచరణముల్ శరణుఁ జొచ్చి
నారదాదులను జెన్నార దారిగ నెంచి
భాసురుం డగుకాళిదాసుఁ బొగడి
దండిమయూరుల దండిగా వినుతించి
భవభూతిబాణులఁ గవనఁజేపి

నయమునఁగొల్తు నన్నయ నట్ల గొల్చెదు
దిక్కని మ్రొక్కుదుఁ దిక్కనార్య.

గీ. మఱియుఁ దక్కినసుకవులమహిమ నెంచి
కృష్ణభూపాలుఁ గీర్తివర్ధిష్ణుఁ దలఁచి
మత్పితామహుఁడైన కుమారపెద్ది
రాజసుకవిని మదిలోనఁ బూజ చేసి.

క. ఉష్ణాంశోదయ సమరో
చిష్ణుత్వ లసత్ప్రకాశ చిన్మయ తనువ
ర్ధిష్ణుఁ డనువానిఁ గొలుతును
వైష్ణవ మహిమానుసరణు వకుళాభరణున్.

అటతాళం.

శ్రీపరాశరభట్టరాన్వయ శేఖరుండూ - మద్గురు
రూపవంతుని వెంకటాచార్యుల నుతింతున్
శూరులను పన్నిద్దరాళ్వారులను నే తలంతును
కోరి సుందరదేశికుని కనుంగొని పొగడుదున్.

క. రామపదభక్తియును శ్రీ
రామాయణ భాగవత పురాణములకథల్
నేమమున వ్రాపి చదివే
ధీమంతుని వెంకటక్షితీశ్వరుఁ గొలుతున్.

వ. ఇట్లు ఇష్టదేవతావందనంబును కవిజనాభినందనంబునుం గావించి యే మను
చున్నాడు.

త్రిపుట.

వరధనంజయగోత్రవర్ధన వార్ధి చంద్రుఁడు సుగుణసాంద్రుఁడు
స్థిరకరుండగు గొట్టుముక్కల శేఖరుండు
కృష్ణనృపతికి పెద్దమాంబకు కీర్తి వెలసిన తనయుఁడన్
విష్ణుభక్తుఁడ సింగరాట్కవివీరవరుఁడన్.

వ. ఏ నొక్కనాఁడు హరికథారచనాతత్పరుండనై సప్తమీభానువాసరంబున శుచిప్రదేశంబున బ్రాహ్మీముహూర్తంబున కించిదున్మీలితనయనుండనై యున్నసమయంబున మత్స్వప్నంబున.

సీ. వరమీనకాంతులు వహి మెఘపంక్తులు
యిలకన్బొలనువు యింద్రధనువు
మేనిమెఱుంగులు మేలుమెఱుంగులు
కరుణామయపు దృష్టి సునసువృష్టి
రంగుశృంగారముల్ గంగాతరంగముల్
శైవాలలతలు కేశములజతలు
మీఁగాళ్ల తాఁబేళ్లు రాక లంచలబాళ్లు
సరిగంచుపట్టు మేల్నురుగుతట్టు

గీ. కంకణములరవలు కంకణరవములు
గాఁగ యాప్రవాహగరిమ పొంగి
సత్యభామ కృష్ణసహితయై ప్రత్యక్ష
మైన నేను మిగుల హర్ష మంది.

వ. ఇట్లు ప్రత్యక్షంబైన సత్యాకృష్ణులకు నేనును భక్తిపూర్వకంబుగా దండప్రణామంబు కావించిన వారును కరుణావలోకనంబున కటాక్షించి ఓవత్స! నీవు రచియింప నుద్యోగించు మచ్చరిత్రంబు పారిజాతాపహరణ యక్షగానంబు సీతారామాంకితంబు గావింపుమని యంతర్హితు లైరి. నేనును మహాప్రసాదంబని మత్కృతి నాయకుండైన రఘునాయకుల నేమని కొనియాడుచున్నాఁడు.

జంపె.

తపనుకులమునఁ బుట్టి తాటకిని తలగొట్టి
యుపల నబలను జేయు సుపదునిఁ దలంతుఁగా
చెఱకు విఱిచినలీల శివువిల్లు నవలీల
విరిచి విజయశ్రీల వెలయుదొర నెంతుఁగా
ఖ్యాతిగ వివాహుఁడై సీతావివాహుఁడై
భాతి భృగురామ పరిభూతుని స్మరింతుఁగా

జనకజాసౌమిత్రిసహితుఁడై సహితుఁడై
మునివేష శ్రీరామమూర్తిఁ గీర్తింతుఁ
ఖరదూషణాదులను ఖండించి మారీచుఁ
బరిమార్చు శ్రీరామభద్రు గణుతింతుఁ
పవనసూనునితోడి బాంధవము దయఁ గూడి
రవిజుఁగాపాడి తగురాముఁ బ్రార్థింతుఁ
వాలి నొక మ్మెసి నేలపాటుగఁ జేసి
లీల సుగ్రీవుఁ బాలించు విభుఁ గాంతుఁ
కడలిఁ గోలకుఁ దెచ్చి దుడుకు రక్కసి ద్రచ్చి
పుడమిసుతఁ దెచ్చునా భూపాలుఁ గొల్తుఁ
శ్రీరంగశౌరిఁ బూజించి యాశ్రితలోక
పారిజాతుని రామభద్రు నుతియింతుఁ.

వ. మఱియు నద్దేవునకు. (Contd)

షష్ఠ్యంతంబులు : చెప్పె నట యెటువలెను.

క. శరధిప్రబంధనునకును
శరధియుగాలంకృతునకు శార్ఙ్గధరునకుఁ
శరధి శరధినుతునకు దా
శరధికి శ్రీరామునకును జగదీశునకుఁ.

క. నీలాంబుద వక్షునకుఁ
నీలోత్పల కమలమిత్త్రి నేత్ర యుగునకుఁ
పాలిత మునిజాలునకుఁ
పాళెము శ్రీరామునకును పరమాత్మునకుఁ.

వ. సమర్పితంబుగా నాయొనర్పం బూనిన పారిజాతాపహరణం బను యక్ష
గానంబునకు కథాసంవిధానం బెటువలెను.

ఉ. శ్రీరమణీయమై విబుధసేవ్యకరంబయి పెంపుగాంచునా
వారిధి నూత్నరత్నమణివార పరీవృత శాతకుంభమం

జీరముఁ బోలఁ గ్రోలు పురశేఖరమై తనరారి యొప్పునా
ద్వారక తారకల్ నొరయు ద్వారకవాట కషాగ్రగంగయై.

వ. మరి న్నెటువలెను.

జంపె.

అలకాపురము దరము నల కాపురము రమకు
యిల ద్వారకాపురము యిందిరాకరము
నూపురము వారినిధి దాపురము ముక్తినిధి(?)
గోపురంబుల నొరయు గోపురము లరయ
ద్వారకనకకవాటి తోరణంబులచేత
ద్వారకాపుర మమరుఁ దారకల నొరసి.

వ. మఱియు నప్పట్టణంబు పాతాళంబునుం బోలె అనంతభోగభాసమానంబై కైలాసంబునుంబోలె సర్వమంగళాస్పదంబై వైకుంఠధామంబునుంబోలె మాధవానందకరంబై ప్రాకారపరిఘాట్టాలక ప్రాసాదతోరణారామాభిరామంబును, రథగజతురగపదాతిసంకులంబును, వారాంగనావార సంగీత నృత్యప్రత్యలంకృతంబును, అభినవశీకరపరంపరామోద మేదురాభ్రంకష శ్రీవశీకరంబులైన కమలాకరంబులను, సకలవస్తువిస్తారప్రశస్తంబులం గలిగి ద్వారకాపురం బొప్పు నప్పురాధీశ్వరుండు.

త్రిపుట.

శ్రీయురోపాలంకరిష్ణుఁడు శ్రీల గుణవర్ధిష్ణుఁ డాద్యుఁడు
గేయమానాబ్జభవజిష్ణుఁడు కృష్ణుఁడతఁడు
సాధుబృందావనవరిష్ణుఁడు సర్వశత్రునిరాకరిష్ణుఁడు
వేదబృందావనవరిష్ణుఁడు విష్ణుఁ డతఁడు
పుండ్రనామకరణవిహారాద్భుతకరుండు పురాణపురుషుఁడు
పూతనామరణప్రవీణాద్భుతకరుండు.

వ. మరి న్నెటువలెను.

త్రిపుట.

ధీర రుక్మిణి సత్య జాంబవతీసతీమణి మిత్రవిందయు
చారు భద్ర సుదంత కాళింది రమణియు

లక్షణయు నెనమంద్రు మహిషులు లాలితంబుగఁ గలరు మతి
లక్షణలు పదియాఱువేల వెలందు లెలమిఁ
చేరి తనుఁ గొలువంగఁ గోర్కెలు చేకురంగ నొసంగుచుఁ ఆ
వ్వారిగా వారికిని హారి విహారి యగుచుఁ.

వ. మరి న్నెటువలెను.

జంపె.

ఏవేళ నేయింతి యేలీలఁ గోరునో
ఆవేళ నాయింతి కవి దెచ్చి యిచ్చుఁ
ఏయింటఁ జూచినా నెలమి మెలంగుచు పెక్కు
మాయావినోదరూపాయత్తుఁ డగుచుఁ
చంద్రశాలలయందు సౌధజాలములందు
చంద్రకాంతపు శిలాస్థలవేదులందు
కేళీగృహములందు కృతకశైలములందు
పూలతోఁటలయందు పొదరిండ్లయందు
కేళీవిలాసబహులీలలను లలిఁదేలి
యాలలనలను గూడి వారి నోలలాడి

వ. మరి న్నేరీతి పాలించుచున్నాడు?

పగడాల కంబాల పసమించుడాల మగరాల మాణిక్యజాలా
చకచకిత విశాల చంద్రశాలలను
చికిలిమేల్ మేడలఁ జెలఁగుపీఠలను
పదియాఱువన్నెల పసిఁడిమేడలను
పదియాఱువేల గోపస్త్రీలఁగూడి
రుక్మిణీప్రముఖనారులఁ బునారతుల
రుక్మాంబరుఁడు సమరూపున నేలి
అతులితవిభవము లైశ్వర్యములను
చతురుఁడై యాదవసామ్రాజ్యమందు
పూజ్యత మీఱి సంపూర్ణవిరాజి
రాజ్యంబు సేయుచు రంజిల్లు చలరి

శ్రీకృష్ణుఁ డీరీతిఁ జెలుల నందఱిని
ఏకరూపునఁ జూచు చెలిమి రుక్మిణిని
సత్యభామకు చాల చనవు లిచ్చుచును
నిత్యోత్సవంబుల నెగడి శోభిల్లి
నిత్యశోభనముల నింపు సంధిల్లి
నిత్యకల్యాణుఁడై నేర్పు ఘటిల్లె.

వ. ఇవ్విధంబున నవ్వసుదేవనందనుం డమందానందకందళితహృదయార విందుండై మందగమనల నందఱం గందర్పకేళిం దేల్చి యోలలాడుచు సకలరాజకోటి కిరీట కోటీర చిరత్నమయూఖ నీరాజన విరాజమాన పాదారవింద యుగళానంతభాగాభోగభాసురోల్లాసుండై విహరింపుచు నొక్కనాఁడు రుక్మిణీకాంత నిశాంత శశికాంతోపలవేదికాంతంబున నేకాం తంబున శ్రీకాంతుండు కాంతాసహస్రంబులు గొలువ రుక్మిణీకాంత యుం డాను మోదంబుగా జూదంబు వినోదంబుగా నాడుచు మందహాసోల్లాస విలాసులై సరససల్లాపంబు లాడుచు నిష్టగోష్ఠి నున్న సమయంబున కలహసంభ్రమపరోత్సాహుఁడైన నారదుండు వచ్చె నట యెటువలెను.

ఝంపె.

సాంద్రాభ్రవాయోహతి సప్తస్వరంబులను
మంద్రమధ్యమగతుల మహతి మ్రోయగను
గంగాపయఃపూర్ణ ఘనకమండలు వలరు
శృంగారహస్తమున చెలువు మీఱఁగను
హరిహరీ నారాయణా యనుచు ప్రణవజప
సరము నెన్నుచు హరిస్మరణ ...
దేహకాంతులు చాల తేజరిల్లఁగ వచ్చె
ఆహవాళనమౌని హరిఁ జూడఁబూని.

దరువు

...వనమాలికేలు పేరురమునా
కి వెల్ల వడి నెంచు జపసరము కరమునా

గునిసి యందుచు మీసరమునా
? ... ... ... ... భాసురమునా.

వ. ఇట్లు వచ్చిన నారదమౌనికి హరి యెదురుగా నేగి పూజావిధి నారాధించి రుక్మిణీ పురస్కారంబుగా నమస్కారంబులు గావించి తదనుజ్ఞ కొందఱు మందగమనలు రత్నసింహాసనంబు మునికి సమర్పించిరి. హరి మునియాజ్ఞ నర్ఘ్యాసనంబునఁ గూర్చుండి కరంబులు మొగిడ్చి యే మనుచున్నాడు.

జంపె.

నారదా! శ్రీలు చెన్నార దయఁ జేసి
కన్నార దాక్షిణ్యమునఁ బ్రోవ రాదా
మీరు మాపై కరుణ మీరుటకు యిది భవ్య
కారణము నీదు రాక రణాశనుండా
అనిన కృష్ణునిమాట విని దేవముని బూని
అనియె నీ వీరీతి ఆడఁగా నీతె
ద్వారకే వైకుంఠధామంబు తగు శీవి
యీ రుక్మిణీదేవి యిందిరాదేవి
మీర లిరువురు మాకు మేలిమిగ తలిదండ్రు
లారూఢి నిన్నుఁ గొనియాడ నోపుదునే.

ఏకతాళి.

హరిహరి మురహరి నరహరి శ్రీహరి
గిరిధర ముకుంద కృష్ణహరి
మాధవ కేశవ మధుసూదనా జగదాధారుని యాదవచంద్రు!

వ. మరి న్నేమని కొనియాడుచున్నాడు.

త్రిపుట.

వాలుగై మున్నీటిలోపల వ్రాలి సోమకుఁ జంపి చదువులు
నాలుగును యానలున కొసఁగిన నటుఁడ వీవా
మేలు మేలన సురల కమృతము మేలుగా నొసంగి యెలి తరిమల
వేలు పాపక తాల్చి తొలి తాఁబేలు వీవా

పందివై పెంపొంది వైపున నంది పుడమిని కొమ్మున పరి
స్పందివై కనకాక్షుఁ జంపిన ప్రౌఢ వీవా
ఉక్కుకంబము వెడలి దిక్కులు పిక్కటిల్ల హిరణ్యకశిపుని
అక్కువక్కలుఁ జేయు నరసింహంబు నీవా
పొట్టివై అదితికిని ముద్దులపట్టివై బలిమెట్టి మదితో
బుట్టునకు పట్టంబు గట్టిన దిట్ట వీవా
ఆజిలో నిలఁ గల్గురాజుల తేజి మెల్ల నడంచి కీర్తి వి
రాజిలంగను నెగడుభార్గవ రాముఁ డీవా
రాతి నాతిగఁ జేసి రీతిగ భాతి మీరగ ఖ్యాతి చేరగ
నీతిగా గౌతముని గాచిన నృపుడ వీవా
పూతనాకంసప్రలంబుల పోరిలోపలఁ జంపి ద్వారక
నీతిగా పాలించు నిత్య విభూతి వీవా
కలికితనంబున రక్కస కలికితముల శిగ్గు వెలకలపుడు(?)
వెంటఁ ... ... ... ముప్పొద్దు కసిమసంగుఁ.

ద్వి. అని యిట్లు బహురీతి హరిని కీర్తించి
మునివరుఁడు ... ... ... ...
... ... ... ... కధ వాసనాభి
నందిత బిరుదుగానామృత పతన
వందిమాగధ బృందవర్ణితం బనఁగ
ఇందిందిరంబులు నెలమితో మ్రోయ
మకరంద తుందిలా మ్లాన మానితము
ప్రకటీకృతానంత భాగధేయంబు
స్వర్ణది స్వర్ణాబ్జ పర్ణ సువర్ణ
పూర్ణ గర్భిత దివ్యపుష్పంబు నవ్య
పారిజాతసుమం బపార సద్భక్త
పారిజాతున కిచ్చె బ్రహ్మాత్మజుండు
యిచ్చిన మెచ్చుచు యిచ్చలోపలను
అచ్చెరు వంది శ్రీహరి హర్షమునను
క్రొన్నన గైకొని కూర్మి రుక్మిణిని

కన్నార గని సత్యకాంత తలంచి
యిది భీష్మపుత్రికి యిచ్చిన కినుక
మది సత్యభామ యేమని యెంచు నొక్కొ
యెల్లిదముం జేసి యిది సత్యకంప
చెల్లదు వో యిందు చెలగినేనున్కి
యెవ్వరికిని యంప యిది తగ దనుచు
నవ్వు దొలంకఁగా నారదునన్న
భోజాత్మజకు నిచ్చె పుచ్చుక కలహ
భోజనునకు మ్రొక్కి పొలతి యౌదలను
యవ్విరి దాల్చిన యంతనె సొంపు
నివ్వటిల్లఁగ మేన నిగనిగల్ దనర

వ. మరి నెటువలెను వొప్పె.

వాలుగల నగజాలు వాలుకన్నులడాలు
వాలుమించుల మించు వాలురహి నేలు
లికుచ చకచకల వోలి కుచకలశముల కొక
చికిలిజలి చెలఁగె మించి కిలకించితమై
నిద్దంపుటద్దముల దిద్దగల యింపైన
ముద్దుమొగమున కొక్కమురువుహారు వలరెఁగా.

వ. మరి న్నెటువలెను.

ద్వి. ఇవ్విధంబున రుక్మి ణెలమి యౌదలను
పువ్వు దాల్చినవల్ల పొలుపు సంధిల్ల
నెల దాల్చు యభవునినెలఁత వర్థిల్లి
(మెరుంగు ?) వెలుఁగు విధంబున వెలఁది వెలింగె
సవతు లెల్లను వచ్చి చరణపద్మముల
నవనతులై మ్రొక్కి యంజలుల్ సేయ
మారుని శస్త్రము మారు చెలంగి
మారులే కలరె యా మగువ యిం పొదవ
జాతిమాణిక్యంబు సాన దీర్చినను

ఖ్యాతి మీర వెలుంగు కరణి నుప్పొంగె
కలహాశనుం డప్డు కలహ .... .... ....
.... .... .... మనఁ జూచి పలికె
పొలతుక యీదివ్యపుష్పంబు నరుల
కెలమి నీ కియ్యగా యిది వింత సుమ్మ
... ... ... ... యింద్రాణి
వాణి గీర్వాణి శర్వాణియు పూని
రాణింప దాల్తురు రమణను హరికి
ప్రాణంబ వగుట నీపారిజాతంబు
పూవు నీకిచ్చె యిం పొదవ నీవిభుఁడు
నీవు మూర్ధన్యత నెగడి శోభిల్లి
పదియారువేవురు పణతులలోన
చదురుగా వెలసితి సౌఖ్యసంపదల
దీనిమహత్త్వంబు తెలియంగ వినుము
మాననీయంబు అమ్లానమానితము
వాడక వీడక వరుఁగూడి క్రీడ
లాడువేళలను వుల్లాసంబు లొసగు
ఉజ్వలదీపాంకురోజ్వల మగుచు
ప్రజ్వరిల్లగ జేయు రతివేళలందు
హరి గూడి నీవు రహస్యలీలలను
యిర వొంద సురటియై యిచ్చ వర్తించు.

వ. మరి న్నెటువలెను.

అర్ధ చంద్రికలు.

కోరినకోర్కెలు వారక యిచ్చుఁ
బడలికలను తడబడక అడంచుఁ
ధవుని మాట జవదాటక సేయుఁ
చలివేళల వేసవి చలి యొసగుఁ
వేసవి చలువలు వెదచల్లించుఁ

వాడక యీవిరి వీడక యుండుఁ
ఈడు జోడు నీ కెవ్వరు యెంచఁ.

జంపె.

సతుల యందరిలోన సత్యభామామణి
మతిలోన మెలగు యీ మాధవుం డనుచుఁ
విన్నాము గాని యో వెలది నీపై ప్రేమ
కన్నార జూచితిని గారవం బెసగఁ
యీదివ్యకుసుమంబు యిచ్చునె యెవరికిని
యాదవేంద్రుడు ... ... విలసిల్లఁ.

వ. మరి న్నేమనుచున్నాడు.

గీ. రూపయౌవనకళల వారూఢ నంచు
రమణు లెంతయు తన కమరక్తు డంచు
విఱ్ఱవీగెడు సత్య యా విరిమహిమలు
చెలులు పలుకంగ విని చాల స్రుక్కుకున్నె.

జంపె.

వణతిరో యాసత్యభామామణీ నీకు
ప్రణతురాల్ గాకున్నె భవ్యరా లగుచుఁ
అనుచు నారదమౌని యాడువాక్యంబులును
తనరు యావిరిమహత్త్వంబు విని బోటుల్
వేర్వేర పదియారువేవురకు వినిపింప
పేర్వేర పల్కిరి విభీతహరిణాక్షుల్
భోజకన్యక యింటి పూని శ్రీహరి యుంట
భోజాత్మజకు వంట పూవాసగె నంట.

అర్ధ చంద్రికలు.

అనుచును గుజగుజలాడుచు చెలువల్
యీవిరి రుక్మిణి కీ తగ వనుచుఁ
లక్షణ సైచె సలక్షణ యగుచుఁ
భద్రయు మనసును భద్రము చేసెఁ

పంతము విడిచె సుదంతయు నంతఁ
కాళిందీ మణిలీలం దేలెఁ ... ...
సవతు లేని జాంబవతి సహించెఁ
మిత్రవిందయును మిత్రత నొందెఁ.

వ. మరి న్నెటువలెను.

రూపకం.

యిందరిలోపల యందచందముల
చిందులు ద్రొక్కుచు చెలగి మెసగుచుఁ
శశిమణివేదిక పసిడిశలాకన
మిసిమి మివారులు మేలిమి గొలువగాఁ
జిలిబిలి పలుకుల చెవి ములుకులవలె
పలికె సత్యతో పస మిస మిసనఁ
అమ్మరో యేమని నెమ్మది పలుకుదు
ముమ్మాటికి హరి మోసపు చైద్దుల్
రమణను రుక్మిణి రమణత రుక్మిణి
రమణియింట నీ రమణుం డుండగ నారదుం డటువచ్చెఁ
వచ్చి కోరికలు యిబ్బుమ్రానివిరి
యిచ్చెను శ్రీహరి కిచ్చక మెసగఁ
ఆవిరి రుక్మిణి కాహరి యొసగిన
అవిరిచేమని యెందు చెలువకుఁ
ముజ్జన మేలెడుమోనం బంతయు
బుజ్జగింప నింపులు సందిల్లెఁ.

ద్వి. అనుచు నత్తైరవలు నాడువాక్యములు
విని యందె రవలుతో వేగమె కదలి
కోపగృహంబున కొయ్యన చేరి
తాపంబు మారుప్రతాపంబు మీరి
తలిపోశి తలపోశి తాలిమి బాశి
కలవాసిపై రోసి కళవళ జెంది

తలయూచి తలయూచి తహతహ జెంది
దులదుల నిలపొర్లి ధూళిలో వ్రాలి.

అర్ధ చంద్రికలు.

కలగు మాపినపలువ ... ...
చెలరేగుచు కుచ్చెల బిగఁజుట్టుచు
పకపక నగి పైఁపక తలయూచెను
తికమకలుగ నలుదిక్కులు జూచెను
వాసిక కస్తురి ... ... ... పెట్టెను
గాసిల్లుచు చీకటియిలు జొచ్చెను
శృంగారంబుల చెలు వటు వదలెను
అంగజవేదన లందుచు పొరలెను.

వ. అని యివ్విధంబున మనోవేదనా దోదూయమానాంగియై మానిని మానవి
కోపంబునం బొరలె - మరి న్నెటువలెను.

ద్వి. అంతట హరి కలహాశనమౌని
చెంతను ప్రద్యుమ్ను చెలువొప్ప నిలిపి
దారకుం డప్పుడు తారక దెచ్చు
తారకకషణరథం బుదారతను
పైకొని చక్రకంపనమతితోడ
ప్రాకటకక్ష్యాంతరంబులు దాటి
మొగసాల దారకు మొనయించి సత్య
నగరు ప్రవేశించి నగధరుం డంత
చిన్నబోవుచు చాల చెలువంబు స్రుక్కి
యున్న యానగ రెల్ల నొగి పరికించి
తిల్లగోవిందుఁ డాతీ రెల్లఁ గాంచి.

వ. మరి న్నేమనుచున్నాడు.

జంపె.

చదివింప రేలకో శారికాకీరముల
పొదలుగంచల నేల పోషింప రాకొ్కు

నెమ్మిని నటనములు నెమ్మి సరసర జాల
కొమ్మలను సహకారకుల పెనవ రేమి
యూలకిలతల నయ్యాట లూగగ జాల
పూలతోటల నేల ప్రోదించ రేల
విన్నబోయున్నది చెలువ చెలువము చాల
యిన్నాళ్లవలె నుండ దేల యీవేళ
అనుచు సంశయ మొందుచు నాత్మలో వెత చెందుచును
కోపగృహమందు జొచ్చి యింపొందక
ముసుగిడిన యాసత్యముంగ లనువుపడంగ
పస మించుమాయ దోఁపఁగ కృష్ణుఁ డంతన్.

రూపకం.

మెల్ల మెల్లడుగులు మెట్టుచు సఖులను
నల్లన తిట్టుచు నదలించుచును
పంతముతో సత్యభామ కనుంగొని
వింతగ మదిలో విస్మితుఁ డగుచున్
వెనుకను నొకసతి విసరు సురటి గొని
వినయవిధేయత పీవగ దొడగెన్
అంగజాగ్ని యుప్పొంగి పొంగలో పొంగలి
పొంగలి యంచును పొలతులు నవ్వన్
పువ్వువాసన గుబుల్కొన ముసుంగటు
నల్లన ద్రోచిలు నలుగడ లరయన్.

క. కాంత కనుంగొనె నంతట
వింతగతుల జీని సురటి విసరెడువానిన్
కాంతుని గని యతిచంచ
చ్చింతా కలితాక్ష బాష్పశీకర యగుచున్.

అర్ధ చంద్రికలు.

తల వాంచియు ముసుం గెలమి ... ...
... కనులబాష్పోదకణములు రాల్చెన్
వేడియూర్పు లట్టి పోడిమి మించెన్.

వ. యిట్లు కోపతాపోద్దీపితయై ... ... తిఁ జూచి శ్రీపతి యేమను చున్నాడు.

జంపె.

మచ్చెకంటిరో యేల మచ్చరించెదవు చాల
యెచ్చైన సుమాలు ధరించ వది యాల
ఎలనాగరో తేనియల నాగరికముతో
పలుక వేఁటికి చికిలిపలుకొంతి మెఱయఁగా
కలకంఠిరో నన్ను కడకంటి చూపులను
చెలువలరగా కటాక్షించ రా దటవే
మాట జవదాట ముమ్మాటికిని యేటికీ
నాటకము మరచితే నాటికూటములు.

వ. యివ్విధంబున నవ్వసుదేవనందనుడు జవ్వని నెవ్వగలు మాన్చుట కెవ్వి యుపాయం బని సకల సురమునినికర సమర్చనంబును, ప్రకటమకుటా లంకృతంబను నగు శిరంబు సతిచరణంబులు సోఁక మ్రొక్కిన ఆ వామ లోచన వామపాదంబునం దొలగం ద్రోచిన కూర్మి పేర్మి తప్త కరస్పర్శ నంబున శ్రీహరిదేహంబు పులకాంకరంబు లంకురింప మదనసామ్రాజ్యో ద్దీపకుండై యే మనుచున్నాడు.

జంపె.

కలికి నీనెయ్యంపుటలుకచే తాకినది
చెలగు నామీద దయ చేయుటయు నాయె
నీదు పదపల్లవము నెంత నొచ్చెనొ కాక
నాదేహమున సోక నలుక విడు మింకఁగా.

గీ. అనిన యాసత్యభామ పయ్యదచెరంగు
వేగ కుచములపై జేర్చి వేణి ముడిచి
చిరుచెమట నెమ్మొగమ్మున చెంగలింప
కన్నుగవ కెంపు గదురంగ కనలి పలికె.

జంపె.

యీమాయనయములను యీమాయప్రియములను
యీమాయభయము లిటు యేమాయ మాకుఁగా

జాలములు యివి జగజ్జాలకుడ నీకు పది
వేల మొక్కులు చాలు చాలు నియ్యానఁ
నారదుడు పూ వొసగునాడు రుక్మిణి కిచ్చి
పారిజాతమువలపు ప్రకటించి తెలుపఁ
యిప్పు డిటు వచ్చి న న్నేకసక్కె మొగి సేయ
తప్పొపచారముల తగుప్రీతి సేయఁ.

వ. అని మరి న్నేమనుచున్నది.

అటతాళం.

మానమె భూషణము లెంతయు మానినులకుఁ తలంపంగ
మానమె ప్రాణాధికం బగు మగువలకును
ప్రాణమైన పరిత్యజించియు పాటమీఱఁ మానము
త్రాణతో రక్షించగావలె తరుణులకును
పుణ్యజనులను సంహరించిన బుద్ధి యెటకుంబోవును
గణ్యతను చన్నిచ్చునాతివిఘాత నీకుఁ.

ఏకతాళిరేకులు.

దేవకీరమణి సేవసేయగా బోవంగ
నామది బొసంగెడు నీవుఁ
మునుపు లెంతయును చనవులిచ్చి
యిపుం డనువుగ గొనుట వీ యర్హ్మంబగునె
యీశమంతమణి యెవ్వతె యొదల
మీసరంబుగ వెలయ వలయునొ
ఆడుచు పాడుచు అతివెవ్వతో
యీమేడల నీడల మెరయు క్రీడలఁ
నను సరివారలు నగకమున్న
ని న్కనికరమున దిగ్గన మెప్పింతుఁ.

త్రిపుద.

అనుచు గద్గదకంఠ యగుచు మరుమాటాడ
కనె విభుని చెంగటను కడు బొంది బొరలి

చందురునితోడ హెచ్చందు మొగమందు వెత
చెందుచును పయ్యంట చెరగు చెలువొందఁగా
కలకంఠ కలకంఠి కాకలీస్వనముతో
జిలిబిలిగ నేడ్చె నా జీవేశునెదుటఁగా.

క. అప్పుడు కుహనాశ్రీహరి
ముప్పిరిగొను మోహతమము ముంచు కొనంగా
కప్పురగంధిని తమకము
చిప్పిల వెగి కౌగిటందు చేర్చిట్లనియెఁగా.

దరువు.

యాలనే యీవేళ జాలి బొందగ నేలె సత్యభామా
నీకు నే లాతి నటె నీలాలకజాల సత్యభామా
అవిరళ మైనపర్యంకము లుండంగ సత్యభామా నీ
కవనిపై పవళింపగా నేల యీవేళ సత్యభామా
హరిహరాదులైన అడ్డమైనా గాని సత్యభామా యా
సురవృక్షమును దెత్తు సులభముగ నీకిత్తు సత్యభామా
కేళి తమ్మికొలను కొలకొల పలుకుల సత్యభామా నీ
కేళీవనమయ క్రీడగా నాటంతు సత్యభామా.

ద్వి. యీరీతి శ్రీహరి యింతితో పలికె
పారిజాతము దెత్తు పణతి నీకిత్తు
నని చంద్రశాలకు నతివయు తాను
చని జనితాహ్లాద సరససల్లాప
సంగతి దనరంగ సత్యభామకును
యింగితబహుమాన మెలమి నోలార్చి
సంతాపనిర్వారస్వాంతుఁడై యున్న
అంత మధ్యాహ్న ఘంటారవంబపుడు
విని నిత్యకృత్యముల్ వెసజేయు తలచు
వనజాయతాక్షుని స్వాంతంబు తెలిపి
సత్యభామాలోకసంజ్ఞచే చెలులు

దైత్యారియెదుట నంతంతట నిలచి
యొలపి వినయముతో(డ) నొకనీలవేణి
జలకంబునకు వేళ స్వామి యటంచు
కలకల కలకంఠ కంఠనాదముల
జిలిబిలి పలుకులచే విన్నవింప
కందలించిన వేడుకను సత్యభామ
మందహాసమున బొమ్మని సన్నజాయ
జిలుగు బంగరుచేల జీరాడి తూల
చలికేల వలకేల చేలా(లం ?)గు వ్రాల
సాహాస కంమ్మెకి సంచయం బపుడు
సాహో పరాకు హెచ్చరికె యనంగ
గద్దిగ డిగ్గిన కలికి యొకర్తు
పద్దున పాదుకల్ పదములఁ దొడుగ
కేళికా మజ్జన గృహమున కేఁగి
నీలంపుమణి పీఠి నెలకొని యుండె.

వ. యిట్లు నెలకొన్న వల్లవీపల్లవునకు కొందరు పల్లవపాణులు కౌస్తుభాది భూషణంబులు మెల్లన సడలించిరి యిద్దరు ముద్దియలు తాతవృంతంబులు విసర నొక్క కప్పురగంధి బాగాలు కప్పురంపుటాకుమడుపు లందియ్య నొక చంపకగంధి సంపంగినూనె యంటె నట యెటువలెను.

జంపె.

తలయంటె నొక్క మాద్యద్ద్విరేఫాలక
జలజాయతాక్షునకు సస్నేహ మలర౯
గంధామలక మొక్క కలకంఠ మృదువాణి
సంధించి నించె నా చతురాస్యునకును
పంకేజనిభవక్త్రి పపిడిగిడి యుంచె
కంకణము లుల్లసిలగా జలక మార్చె
... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...
... ... రా రప్ప ముంగాముఱంబులును
వుంగరంబులును కడుం గరం బిందెన్.

అర్ధ చంద్రికలు.

హారములను శృంగారముఁ జేసెన్
నొకసతి మకుటము నొగి సవరించెన్
కుండలంబు లొక కోమలి దాల్చెన్
విరులసరు లొకవిరిబో ణొసగెన్
చందుగ నొకసతి చందన మలదెన్
సురటిచేత నొకసుందరి విసరెన్
నిలువుటద్ద మొకనెలతుక నిలిపెన్
నెలతలు యిచ్చిరి నీరాజనముల్
(హంసపాదిలో పాదము)
అతివలు కపురపుహారతు లెత్తెన్.

గీ. అలరుబోణులు సత్యకు జలక మార్చి
చలువదువ్వలువ లొసంగి కలపమలది
దివ్యభూషణములు తాల్ప తీర్చినట్టి
పొలుపు మీఱినపుత్తడి బొమ్మపోలె.

వ. యివ్విధంబున దివ్యభూషితాంగియై యాసత్యభామ భామాసహస్రంబులు గొలువ మేఘమండలంబు వెలువడిన చంద్రకళవిధంబున హర్షోత్కర్షంబున హరి చేరవచ్చిన ప్రేమాతిశయంబున గారవించె. నారదుండును రుక్మిణిచేత అర్చనంబులు గొని సముద్రోదకంబుల మాధ్యాహ్నికంబులాచరించి యమ్మురారిసన్నిధికి చనుదెంచిన నమ్మాధవుండును సతీసమేతుండై సత్కారంబు లొనరించి యిష్టగోష్ఠి నున్నంత యిద్దరు ముద్దియలు పళ్లెరంబులు వెట్టితిమని విన్నవించిన నారదుండునుం దానును భోజనశాల కరుగుదెంచి ప్రద్యుమ్నాదినందనులును సాత్యకిముఖ్యసోదరులును బంధువులుం దానును నారదునిమ్రోల నర్హపీఠంబులం గూర్చుండి రట మెటువలెను.

క. బంగారు పళ్లెరంబులు
శృంగారవతుల్ ఘటించి చేకంకణముల్
ముంగాముదారు లలరగ
రంగుగ వడ్డించి రపుడు రాజాన్నంబుల్.

ఆటతాళం.

నూనె బూరెలు అతిరసములు మహాహారములు వడలును
పానకము చలినీరు వెన్నప్పాలు పాలుఁ
తేనెలు యెలనీళ్లు బెక్కైఁ ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...
... ... ... చుచు
ఆకలహభోజియును దానును ఆరగించెఁ.

ఎకతాళిరేకులు.

కంకణములు ఘలుఘ ల్లనంగను
పంకజవదనలు పసిండిగిండియల
గంధోదకములు గరిమ యొ్యసగఁగ
బంధులు దానును పానులు యార్చెఁ
ఫెళఫెళ యని దువ్వలువలు వెలయఁగ
అలరుంబోడులు అలరందియ్యఁ
జాళువకపురపు జాలవల్లికల
లాలిత తాంబూలములు యిప్పించెఁ
చంద్రశాలలో శౌరి యుండగా
చంద్రకళో యన సతి యేతెంచెఁ
వచ్చి మౌనిపదవనజము లెరగుట
అచ్చుపు దయ నత డాదర మొప్పఁ.

జంపె.

పతి మీరు కనుసన్న మతిలోన మెలగంగ
అతులితైశ్వర్యంబు లంది యుండంగఁ
యితరసతు లనుబుద్ధి యేమి దీవన లిత్తు

మతిలోన నిన్ను ముమ్మాడిక్కి కొని మెత్తుఁ
నీవు కోరిన కోర్కె లెలమి .... ఘటించు
గావుతఁ నీ విచ్చు దీవెనలవలనఁ.

వ. అని పలికిన మౌని హరిం గని పోయి వచ్చెద దయ మరవకుమీ యనే వుడు కృష్ణదేవుండు కార్యఘటనాతత్పరకుతూహలుండై యేమమ చున్నాడు.

ద్వి. వినవయ్య నారద! వృత్తాంత మొకటి
గొనకొని సురమాత కుండలద్వయము
నరకుండు గొనె వంచనంబున మున్ను
కరకు రక్కసుఁ ద్రుంచి కైకొంటి నేను
నాటనుండియు దాచినాడ నచ్చటికి
పాటిగా వత్తు నాపణతి కే నిత్తు
యివి బిడౌజునితోడ నెరుగింపు మనుచు
సవినయంబుగఁ బల్కి సన్మౌనివరుని
వీడుకొల్పియు దాను వెలదియు సొగటు
లాడుచు నుండంగ నపరదిగ్గిరిని
రవి చేరె సాంధ్యానురాగంబు మీరె
కవజక్కవలు బారె కరువలి దేరె
తమ్ము లల్లన తారె తారలు దేరె
క్రమ్మి చీఁకటు లూరె ఖగములు జారె.

వ. అట్టి కటికచీకటిని జారస్త్రీలు యెవ్విధంబున విహరింపుచున్నారు.

క. నీలంపు భూషణంబులు
నీలంపు మణుంగుచీర నీలపుకలువల్
దాలిచియు జారకాంతల
చా లొగి విహరించి రొగిని సంకేతములఁ.

వ. ఆసమయంబున చంద్రోదయం బయ్యె నట యెటువలెను.

ద్వి. చెంగల్వసంగాతి శిరులపెం్ణజ్యోతి
నింగి విలాతి మున్నీటికి సూతి
ముక్కంటి తలపువ్వు మునులకు బువ్వ
చు౯్కల ఱేడు హెచ్చుల వన్నెకాఁడు
కలువల విందు జక్కవ విప్పుమందు
చలువలు చిందు హెచ్చందు చందురుఁడు
ఉదయశైలమునందు ఉదయంబు నొంద
ఉదధిసప్తకములు ఉబ్బుపా టొంద.

ఝంపె.

అచ్చంపు తెలివెన్నె లచ్చొత్తిన ట్లాయ
పచ్చవి ల్తుండు వెలిపాశెంబు శాయఁ
వెలివెన్నెలలగుంపు వెలుగుతారలు ....
వలికరువలి చాలు బలగంబు లాయఁ.

వ. వెండియు నప్పుడు వెన్నెల కన్నులపండువై యుండ మవసుఁడు
విరహులపై దండు వెడలె నట యెటువలెను.

సీ. చెరకు శింగిణి పూని తరచుగా చెంగల్వ
విరిశరంబుల డాసి వేసి వేసి
మొగిలిపూరేకుల మొలవంకు ... ...
... ... ... ... ... ...
తమ్మిపూబల్ బాకు దారుదారిగ గుచ్చి
నజ్జు నజ్జుగ చేరి నరకి నరకి.

గీ. చిలుకతేజీ నెక్కి వలికరువలిం గూడి
విరహిణీజనాళి వేఁటలాడి
మగలు మగువ లపుడు మల్లయుద్ధము జేసి
మరుని గొలిచి రపుడు మరులు గొనుచు.

క. ఆ సమయంబున కృష్ణుఁడు
యాసత్యను గూడి క్రీడ లాడ దొణంగెఁ

పూసజ్జమీద మగువల
రాసక్రీడానులోల రతులం దేలెగా.

వ. యివ్విధంబున సత్యభామాసమేతుండై హంసతూలికాతల్పంబున నిద్రా
పరవశులై యున్నవేళ వైతాళికులు బోధించి రట యెటువలెను.

జంపె.

జయ కృష్ణ గోవింద జయ కేశవ ముకుంద
జయ నందనంద నాశ్రయిత ముచికుందా
జయ రుక్మిణీరమణ జయ కంససంహరణ
జయ కౌస్తుభాభరణ జయ కృపాభరణ
మేలుకో జగదీశ మేలుకో హృషికేశ
మేలుకో విశ్వేశ మేలుకో శ్రీశా
కొక్కొ-రో యనుచును కుక్కుటంబులు గూసె
చుక్క లెల్లను మాసె చూచితే కృష్ణా!
పక్క మాలియు సత్యభామతోడను గూడి
చక్కని శ్రీకృష్ణ శౌరి మేల్కొనవే
తెలతెల్లవారలు తెలిచి చుక్కలతేఁడు
కలువకంటితోడి కళలంటి కూడి
అలసి సొలసియు పశ్చిమాంభోదిలోపలను
చలువవెన్నెలజోతి స్నానంబు జేశెగా
మేలుకో యసురారి మేలుకో కంసారి
మేలుకో శౌరి మ మ్మేలుము మురారి.

ద్వి. అని యిట్లు మాగధు లభినుతి శాయ
విని కృష్ణదేవుండు వేగ మేల్కాంచి
నిత్యకృత్యంబులు నెరవే ర్చమాత్య
భృత్యసమేతుడై పేరోలగమున
నాస్థానమునను సింహాసనమందు
సుస్థితుండై సముత్సుకము మీఱంగ
కాద్యతత్పరతను ఖగనాథు దలప

శౌర్యత వచ్చె కాశ్యపనందనుండు
వచ్చి శ్రీహరిపాదవనజంబులకును
అచ్చంపుభక్తితో అవనతుండైన
మునిరాకయును పుష్పమును యొసంగుటయు
తనదుప్రతిజ్ఞయు తార్క్ష్యతో దెలుప
తగను మహాప్రసాదం బయ్యె ననుచు
ఖగనాథు డుప్పొంగె కరుణించి శౌరి.

వ. యిట్లు ప్రయాణోన్ముఖుండై హరి యుగ్రసేన వసుదేవ బలభద్రప్రముఖ గురుజనంబులకు నమస్కరించి సాత్యకి యిత్యాది సోదరుల నాదరించి ప్రద్యుమ్నాదినందనుల మ్రొక్కులు గొని బంధుకోటి సంభావించి పట్టణ రక్షకు తగువారి నియమించి తదనుజ్ఞ సత్యభామయుం దానును గరుడారోహణంబు సేయ నగ్గరుడుం డేరీతి వెలయుచున్నాడు.

జంపె.

వీకతో తనయవ్వ విడిపించి చెఱ బోవ
వేగంటి దొరబువ్వ వేడ్క గొనుగుహ్వ
పాపఖానపుపిట్ట పక్షిగుంపులగుట్ట
... ... ... ... ... ...
యేపుతో మిన్నంట యెగసె బలుదంట
శంఖచక్రగదాది సాధనము లిరుగడల
పుంఖానుపుంఖముల పొలిచి రా దొడగె.

ద్వి. యీరీతి విహగేంద్రు నెక్కి మిన్నంది
శౌరి సమ్మందహాసముతోడ బలికె
చూచితే యెలనాగ చుక్కలగుంపు
ప్రాచుర్యముగ తలప్రా లయ్యె మనకు
నిలువుటద్దం బయ్యె నిండుచందురుడు
కలకంఠి చూచితే కనకాచలంబు
కిన్నరు లవి చూడు కిన్నరకంఠి
కిన్నరుల్ మీపేరు కెలకుల సాధ్వి

పన్నగుల్ వీరవో పద్మాయతాక్షి
పన్నుగ జూడు పుష్పకవిమానముల
గంధర్వు లదె చూడు కలకంఠకంఠి
బంధురంబుగ యాటపాట లొందెదరు
యక్షులు వీరువో యలికులవేణి
వీక్షింపు కలకంఠి విత్తేశుసఖులు
సిద్ధులు వీరెవో సింధురయాన
సిద్ధాంతశాస్త్రప్రసిద్ధులు వీరు
కైలాసగిరి చూడు కమలాయతాక్షి
శైలజాయుక్తుఁడై చంద్రశేఖరుడు
ముప్పది ముక్కోటి ముఖ్యదేవతలు
తప్పక తనుఁ గొల్వ తనరుచున్నాడు
అని యిట్లు సత్యకు అవటద్భుతములు
కనుఁగొనిపింపుచు కదలి పోపోవ.

వ. యివ్విధంబున నవ్విహంగపతిపై మనోవేగంబునం బోవ పోవ హరి సత్యభామయుం దానును గగనమార్గంబు గడచి చని వియద్గంగం గని రట యెటువలెను.

జంపె.

తనవారి మునుగంగ తనవారి గతగంగ
కనికరము సాగంగ కరుణించు గంగ
భామ యదె విష్ణుపది పదిలముగ సేవింపు
నేమమున భక్తితో నెమ్మనం బలర.

వ. అని యిట్లు మందరధరుండు మందహాసంబున మందలింపుచు మందగమనయుం దానును మందాకినిం దాఁటి సప్తఋషిమండలంబు నిర్గమించి ఖగపతిపై నల్లనల్లన చనుచున్నసమయంబున వెన్నునిరాక పోరోగిరపు తపసిచే విని వేగంటిదొర వెరగంటిగుంపులతో నెదురుగా వచ్చె నట యెటువలెను.

అటతాళం.

తెల్లయేనుగ యెక్కి యింద్రుడు తెలివిమీఱఁగ వెడలెను
బల్లిదులు దిక్పాలు రెల్లను బలసి గొలువఁగ
మేనకాగణికాగణంబులు మేనకాంతుల్ మెరయగా
కానవచ్చిరి యింద్రుతో వేగాన హరినిఁ
మేరుశిఖరము మేఘయుతమై వెడలిన
దారివెడలెను గరుడుపై హరి తరుణి దానుఁ.

ఏకతాళిరేకులు.

అన్నగారి యపుడు యనతిదూరమున
వెన్నుని కనుగొని విస్మయ మొదవఁ
చౌదంతియు డిగి సాష్టాంగంబులు
మోదంబున నమ్రులు గావించెఁ
నిలువెల్లను కన్నులుగా జూచుచు
పొలుపున తమ్ములపూజ లొనర్చెఁ
హరియును సురపతి నతికృప వెలయఁగ
కరములఁ గ్రుచ్చియు కౌఁగిటఁ జేర్చెఁ.

అర్ధ చంద్రికలు.

అనలుం డంతట వినుతి యొనర్చెఁ
(అనలుఁడు వినయావనతుం డయ్యెఁ)
అంతకుం డపుడు అంజలి జేసెఁ
రక్కసుం డపుడు మ్రొక్కు లొనర్చెఁ
వరుణుడు భక్తిని వందన మిడియెఁ
కడువడి కరువలి గిడిగిం డ్లిడియెఁ
ధనపతి సమ్మతి దండము వెట్టెఁ
శూలపాణియును జోహా రొసఁగెఁ.

వ. యిట్లు మ్రొక్కిన దిక్పాలకుల కరుణించి మందమధురభాషణుల నాదరించి వాసవవహ్నివైవస్వతపలలాశివరుణవాయువైశ్రవణ వామదేవప్రముఖుల నిజవాహనంబు లెక్క నియోగించి సత్యభామయుం దానును గరుడారూఢు

పై వేంచేయు అచ్చరల ఆటపాటలను దుందుభివాద్యంబులును చెలంగ నారదప్రముఖామరకీర్తనీయుండై హరి గగనమార్గంబున నేఁగ అప్పు డప్పౌరకాంతలు హరిం జూడ సౌధంబు లెక్కి రట యెటువలెను.

అటతాళం.

కలికి యొక్కతె శౌరిఁ జూచు కౌతుకమునఁ వచ్చెను
జిలుగుపయ్యెదలోని కుచములు గులుకుచుండఁ
వేణి తురిమిన పారిజాతపు విరుల నాసఁ తుమ్మెద
శ్రేణి ముసరుకొనంగ వచ్చెను చెలువ యొకతె
బంగరద్దములోన శ్రీహరి ప్రతిఫలింపఁ ఒకచెలి
కౌఁగిలింపఁగ చెలులు నవ్విరి కలకలమునఁ
నగుమొగంబున తిలక మొగి వగ దిద్ది దిద్దక
నగధరుం గనుఁగొనఁగ వొక చిన్నారి వచ్చెఁ.

గీ. చంద్రశాలలపై నిల్చి సంభ్రమమున
జలదవేణులు కృష్ణ శౌరిపయిని
గురిపి లలరంగ మెయి మెరుంగులు వెలుంగ
పారిజాతపువృష్టి యపారముగను.

యొకతాళిరేకులు.

అంతట సురపురఅతివలు గుములై స్వాగతంబుల వుత్సవము దలిర్పఁ
కంతుగురుని వేడ్కల జాలకముల వింతగ గని నువ్విళ్లూరంగను
వారిజాక్షుడును వారల మెచ్చుచు హరి రాజపథ మంతట దాఁటెఁ.

వ. యివ్విధంబున రాజమార్గంబు గడచి బిడౌజుహజారంబుబైట వైన తేయుని డిగ్గి వేత్రహస్తులు శేయుపరాకుశబ్దంబు లుల్లపిల్ల యింద్రుం డొసంగు కైదండ గొని కక్ష్యాంతరంబులు గడచి చని చింతామణి పీఠంబుపై శచీప్రముఖులు గొలువ పేరోలగంబున అదితిం గనుంగొని నమస్కరించి కుండలంబు లొసంగిన నయ్యదితి హరిం గని దీవించి చింతారత్నపీఠం బున కూర్చుండ నియమించి యేమని కొనియాడుచున్నది.

దరువు.

శరణాంతవేదాంతరంగా భక్తజనసాదరకృపాతరంగా
శరణు శరణాండజసురంగా పాదజలజాతసంజాతగంగా
శరణయ్య భవరోగవైద్యా శరణయ్య వేదాంతవేద్యా
శరణు బ్రహ్మాదికృతపాద్యా కృష్ణసత్యభామామనోహృద్యా.

దండకం.

శ్రీకృష్ణదేవా జగన్నాథ భక్తావనోత్సాహ ముక్తిప్రదా కౌస్తుభాలంక్రియా మున్ను నీవున్న యా దేవకీదేవి గర్భంబునం దుద్భవం బంది యానందుఁ డో మందగోష్ఠం బధిష్ఠుండవై పూతనాదూరణఖ్యాతి చెన్నారి తా పూతనామప్రవీణత్వముం మ్మీరి బల్ బండిరాకాసి కేశీతృణావర్తులం జంపి రేపల్లెలో గొల్లవిళ్లందు నీవెన్న యావెన్న లెల్లన్ కడున్ కొల్లలాడంగ వారుం యశోదామతల్లికిం జెప్ప తాళ్లన్ నినున్ రోలనుం గట్టపెన్నుద్దు లౌమద్దులం గూల్పవా, సాధుబృందావనా నీవు బృందావనంబందు గోవత్సలం గావ వత్సాసురుం గొట్టి త్రోవడ్డ మైనట్టి దావాగ్నినిం ద్రావితావియ్య చంచత్ఫణామండలిన్ తాండవం బాడవా రాసకేళీమహోల్లాస గోవర్ధనోద్ధారణోద్యత్ప్రియాసా మహావేణు నాదాభిలాషా సుఘోషాంగనా మారవేషా ముదాభాష్యభాషా పతిత్ప్రిస్ఫురత్ ఘోషకగ్రాహ గోవత్సలం వత్సలత్వంబునన్ పుష్టి సృష్టింపవా సక్రమావక్రు నక్రూరువెంటన్ కడుం దంటగా బోయి కుబ్జాంగనం బుజ్జగిం చెంతయుం బ్రోవవే కంసునింటన్ ధనుర్భంగమున్ జేసి చాణూరి నింటన్ ముష్టికున్ ముష్టియుద్ధంబునన్ నష్ట మొందింపవే కంసునిన్ సద్భలోత్తంసునిన్ చించి హింసింపవే యుగ్రసేనాప్రతిష్ఠాపనాచార్య మాతాగురు ప్రాభవామోద సంస్థాపనా రుక్మిణీ సత్యభామాది రామామనోహరా బాదాసురా ఖర్వగర్వాపహారా బిడౌజాత్మజాఖీలసూతుండవై కౌరవప్రాణసంఘాతకుండౌము యాధర్మజుం పేరితోడన్ ప్రతిష్ఠింపవా ద్వారకావాస వైకుంఠవాసా సురేంద్రాదివంద్యా నమో యాదవేంద్రా నమస్తే నమస్తే నమస్తే నమః.

క. అని యీతీరున కృష్ణుని
వినుతింపుచు అదితి కృష్ణ విందై మాయిం

టను నేఁడు రేపు యుండుము
వనితయు నీ వనిన నతడు వల్లె యనుచునుఁ.

ద్వి. అంతట నదితికి హరి మ్రొక్కి వైజ
యంతంబునకు యింద్రుననుమతి నేఁగి
కాంచె తదున్నతకాంచనరత్న
చంచత్సుధామయ సౌధరాజంబు
అర్థిజనాభిమతార్థప్రదాన
సార్థ చింతామణి సంభావితంబు
గోత్రభిన్మహనీయ గుణగణాకీర్ణ
చిత్రకర్మ విచిత్ర చిత్రకరంబు
మందారసుమ ... ... కరండగంధ
తుందిలాహ్లాద వాతూల సంచరము
కరమొప్పుచున్న నక్కనక రథమున
హరియుండె నారాత్రి అతివయు దాను.

వ. అప్పుడు తప్పురందరాది బృందారకుల వీడుకొల్పి సత్యభామాసహితుండై
హరి యేరీతి విహరింపుచున్నాడు.

జంపె.

రామాభిరామ యోరామ యారామంబు
గారామమున చూడగా రమ్ము వేడ్కఁ
అనుచు మేనక తార హరిణి రంభ ఘృతాచి
యనునచ్చరలు గొలువ హరి యేఁగె వనికిఁ
అంతటను కల్పకలతాంత హరిచందనా
క్రాంతమలయానిలము ఘుమ్మ రన వీవఁ
చూతమా యెలనాగ చూత మాధవి కుంజ
జాతు కల్గిక యున్న జాతు లవి కంటె
మాకుందముల జూతు మాకంద మలరారు
యాకుందముల జూడుమీ కుందరదనా.

వ. యివ్విధంబున జవ్వనికి యవ్వనప్రాభవంబు జూపుచు హరి యేమను చున్నాడు.

ద్వి. మాధవానుగ్రహ మహిమాగమములు
మాధురీశాఖల మహి పల్లవించె
లీల సుమనోభీష్టలాలిత ఫలిత
లలితమై ని(ద్వి?)జముఖోల్లాసంబు లనుచు
ద్విజఘోషణంబులు .... .... చెలగ
ద్విజరాజముఖి చూచితె యివ్వనంబు
యవ్వన ప్రాదుర్భవామోద మలరు
జవ్వని యన కుచ స్తబకంబు లలరె
సహకార పల్లవోత్సవలీలచేత
గ్రహియించి బిగియార కౌగిట జేర్చి
పెనకువ చౌశీతిభేదబంధముల
గొనకొని పెనగొన్న కొమ్మలో యనఁగ
యాలకిలతలు వో యలనాగ కంటె
తే లతాంగులపోలె లీలల దేలె
దళముల బలసి యుద్దండత మెరసి
ములు మొనలుగ యుగ్రమూర్తి భీకరత
అహిభీషణంబుగా నామోద మలరి
బహుశిలీముఖముల బంధురం బగుచు
నీకె తగు ననెడి నెన్నికె తనరంగ
నీకెలకుల కంటె యిందీవరాక్షి
నీకుచంబుల కోడి నిష్ఠురవృత్తి
ప్రాకటోర్ధ్వముగ తపంబు కావించి
తలక్రిందుగా వ్రేలి తపమున నుండు
చెలువున యెళనీర్లు చెలగెను కంటె.

ఏకతాళి రేకులు.

అని వనితకు హరి యచ్చటవింతలు
కనిపింపుచు ... ... ... ...

... ... ... ... ... ... ...

అచ్చరలేమల కలకలములకును కులుకుచు ప్రేమఁ
గోపసతుల చనుగుత్తుల నొత్తెఁ
కాపుగంట్ల విరిగుత్తులు చిదిమెఁ.

వ. మరి న్నెటువలెను.
రంభముఖ్యులు సంభ్రమారంభు లగుచు
సత్యతో గూడి పుష్పాపచయము జేసి
అలసి సొలసి వియద్గంగయందు డిగ్గి
యీఁదు లాడిరి జలకేళి నాదరమున.

గీ. సఖులు వినువాఁక జలకేళి సలిపి సలిపి
వెడలి రార్ద్రాంశుకంబులు ఒడల నంట
పాలమున్నీట మందరపర్వతంబు
తరువ (వ ?) వెడలిన నచ్చరతరుణు లనఁగ.

ద్వి. యివ్విధంబున వెడ లింతులు దాను
దువ్వలువలు దాల్చి తుల లేక మిసిమి
తులకింప భూషణాదుల పిసాళించు
కలితశృంగారుడై కదలి వే వచ్చి
వైజయంతము నతివైభవం బలర
రాజిల్లె నారాత్రి రమణియు దాను
పరమసమ్మోద సంభ్రమలీల నుండ
నరుణోదయం బయ్యె నంత మేల్కాంచి
నిత్యకృత్యంబులు నెరవేర్చి శౌరి
సత్యయు దాను నుత్సాహంబు మీఱ
నందనవనమున నందనరహాతి
చందన మందార సంతాన కల్ప
పరివేష్టితం బైన పారిజాతంబు
కరమున పెకలించి గరుడుపై నుంచి

తానును సత్యయు తార్క్ష్యుపై నెక్కి
పూనిక నెగసె నేపున సుపర్ణుండు
అప్పుడు వనపాలు లతివేగ వచ్చి
చెప్పిరి పాకారి చేరి యీదారి.

త్రిపుద.

దేవ కృష్ణుడు పారిజాతము ధీరుడై పెకలించి యెత్తుక
పోవుచున్నా డన్న విని యద్భుతముతోడఁ
యన్నగారియు నధికకోపము నన్నగా రటు శాయ బనిచిన
అ న్నినాదము భువనభోంతర మధిగమించెఁ
తాను కట్టాయితముగా పవి దాల్చి అయిరావతము పైకొని
పూని వెడలె జయంతముఖసుర సేన గొలువఁ.

వ. యిట్లు వెడలిన పాకారి పరివేష్టించి పావక పద్మినీవల్లభాత్మజ పలలాశిపాశి పవనపౌలస్త్య పస్పల్లలాటులు నిజవాహనంబుల నెక్కి తమతమ బలముల తోడ వెడలిరి. ముప్పదిముక్కోటిదేవతలు యింద్రునకు తోడుచూపిరి. దుందుభిధ్వానంబులును తూర్యనాదంబులును భువనభోంతరంబులు నిండ నక్కోలాహలంబు విని శౌరి సత్యభామతో యే మనుచున్నాడు.

దరువు.

భామారో యిది సురసేనా మనపై యెత్తివచ్చె వేగా
భీమవిక్రమునే నెందో వారి బింక మడచెద నీవు చూడూ.

వ. అనిన సత్యభామ నమ్మాధవుతో యే మనుచున్నది.

అటతాళం.

దేవ యొసగుము విల్లు నమ్ములు దేవసేనం తరిమెద
నీవు నావిలువిద్య పెంపును నెందు జూడఁ
అనిన సత్యను జూచి శ్రీహరి అలతినవ్వా మోమున
మొనప శరచాపము లొసంగెను మోద మొదవఁ.

అటతాళం.

నారి చేకొని విల్లునమ్ములు నారి చేర్చెఁ వింటను
వైరివీరులు నంతటనె బ్రోవైరి మిగులఁ
గుణవతీమణి లీలవోలెను గుణరవంబూ జేసిన
ఖనిజనీలనజాండ మెల్లరు కలఁగి పగులఁ.

వ. మరి న్నెటువలెను.

అర్ధ చంద్రికలు.

కడువడి వడిబడి జడముడి బెట్టెఁ
చెలరేగుచు కుచ్చెల బిగ జుట్టెఁ
పయ్యెద కొంగై పయ్యెదఁ జేర్చెఁ
ధేయని యనిపెను తియ్యక యార్చెఁ.

వ. మరిన్ని సత్యభామ శరసంధానంబు జేశేక్రమం బెటువలెను.

ఏకతాళరేకులు.

పదినిరువదిముప్పది నలుబది యాఁ
బది యరువది డెబ్బది యెనబది తొం
బది నూరును వే పదిలక్షలు గల
ప్రదరంబుల నబ్బలముల నొంచెఁ
నొంచి నెత్తురుల ముందె నిర్జరుల
కంచుమించునై కలఁగి పరవఁగాఁ
సంగరవీరరసమునరులనూ గను
శృంగారంబున శ్రీవరుఁ జూచుఁగా.

ద్వి. అప్పుడు శ్రీహరి యాతీఁగేఁబోఁడి
గొప్ప కన్నుల కనుంగొని కొనియాడి
తే విల్లు యెలనాగ తివిరి వేవేగ
దేవగణమూ సాగ తెరలింతు మూగ
అని చేతివిలు తీసి అమ్మరిఁ బోపి

ఘనఘనార్భటి గుణధ్వననంబుఁ జేసి
పింజ పింజయు గాఁడ పేర్చెను నంప
పుంజంబు సురలపై బోరిబోరి గాఁడ
చిందర వందరౌ సిద్ధ సాధ్యులును
కొందలం బందుయక్షులును రాక్షసులు
పంచబంగాళ మౌ పన్నగాధిపులు
కంచుమించులుగను గంధర్వవరులు
వే యధాయథలుగ విరిగిన సురలు
చేయి వీచియు నదల్చియు పురికొల్పి
తెరగంటి దొర దాఁకి దివ్యాస్త్రములను
హరిమీఁద నించె మహాద్భుతంబుగను
అప్పుడు తమదు తీక్ష్ణాస్త్ర సంతతుల
కప్పిరి తక్కు దిక్పాలకు లెల్ల
అది యెల్ల ద్రుంచి శ్రీహరి విజృంభించి
త్రిదశుల నొంచి యుదీర్ణత గాంచె.

వ. మరి న్నెటువలెను.

అటతాళం.

తీఁగెమెరు పన గరుడుమీదను తెరవచెంతఁ మెరయఁగ
వేగ మేఘం బనగ హరిశరవృష్టి గురిసెఁ
వైనతేయుఁడు కోపమున వేపైన తేజం బొదవఁగ
పూని సురలను దోలె నప్పు డద్భుతముతోడఁ
అంతటను తెరగంటిదొర కాలాంతకుండో యన సుర
దంతి దిగ్గన నెక్కి కృష్ణుని దాఁకె వేగఁ.

గీ. బిరబిరన ద్రిప్పి వైచిన భిదుర మపుడు
జరజరన వచ్చి హరియురస్థలమునందు
విరిసరం బన నప్పుడు ప్రేలుమండ
సురవరేణ్యుఁడు నది జూచి సోద్య మందె.

గీ. వేల్పుటేనుంగు దిగ్గి యావేల్పుఱేఁడు
తవన హవ నొంద తనకిరీటంబు కృష్ణు
పాదపద్మంబులను సోఁక ప్రణుతి శాయ
చేతులను గృచ్చి యెత్తి యాశీర్వదించి.

వ. మరి స్నేమనుచున్నాడు.

అటతాళ రేకులు.

నమ్మ సురేంద్ర వరమ్మ నీకిత్తు
సుకరమ్మన సుఖమగునె మది నీకుఁ
అన విని సురపతి అపరాధుఁడ నను
కని రక్షింపుము కమలదళాక్ష
ఆదిదేవ కమలాసను మోద ప్ర
హ్లాదవరద గోపాల మురారీ.

గీ. అనిన సురపతిముఖ్యుల నాదరించి
వారి వీడ్కొల్పి పులుగురాతేరిమీఁద
సత్యయును దాను సమరపు సంగవశత
పారిజాతము గొని వ్యోమపథమునందు.

వ. యిట్లు గగనమార్గంబునం జనుచు పారిజాతపువిరులు సత్యభామకుం కనిపింపుచు పారిజాతప్రమానవాసనలవలనను పక్షిరాజపక్షవిక్షేపానిలంబుల వలన శ్రమంబులం జెందక నక్కనకాచలంబు దాఁటి దైవతంబు సమీపంబున వచ్చుసమయంబున తదుదంతంబు విని ద్వారకావాసులు యెదుర్కొని వచ్చి రట యెటువలెను.

ద్వి. యదువృష్ణి భోజార్యు లతివేడ్కతోడ
యెదురుగా నడతేర యిలపురిచేర
వచ్చె వచ్చిన పౌరవరవధూ వార
మిచ్చ గోపురముల నెక్కి నిండార
పేసముత్యంబులు చెల్లుగా చల్ల

గా సంతసిల్లె యాగరుడవాహనుఁడు
రాజమార్గ ... ... ... ...
... ... ... ఘుగఘుగోల్లాసవిలాస
పారిజాతపు తమ పరిమళానిలము
తోరంపురాక యెంతో వేడ్క నోఁక.

జంపె.

ధనకనకవస్తువాహన సమృద్ధులతోడ
ఘనకనత్కాంచనా గారములతోడఁ
రథగజాశ్వపదాతి రమ్యసంపత్కరము
ప్రథితతామరతంపరై వెలసె పురము.

అటతాళరేకులు.

పంగులు కడువడి పరువులు వారిరి
సంగతి మూకలు చతురో .... తులై
విన కన నేరని వికృతపుమనుజులు
విన కన నేర్చిరి వృక్ష మహిమతఁ
దివ్యతరు సుమాధీన సౌరభత
అవ్యయ యవ్వన నలరిరి వృద్ధుల్.

వ. మరి న్నెటువలెను.

గీ. రమణ మురవైరి తన హజారంబుబైట
వైనతేయుని దిగ్గి వేవైనభక్తి
దేవకీదేవి వసుదేవసేవఁ జేసి
హళికిరణరంగ జయ కుతూహలికి మ్రొక్కె.

వ. మరియు ప్రద్యుమ్నాది నందనుల జోహారులు గొని విహంగవల్లభు వీడు
కొల్పి సత్యయుం దానును తనమందిరంబున సుఖాలాపంబుల ప్రతినవచ్చె
కదా యని పారిజాతతరు వ్రాసంగ యద్దేవి హర్షంబునే విభుని బహు

భంగులం గొనియాడి తత్కేలికారామసీమ తద్దేవతరు ప్రతిష్ఠం జేసి అనుదినపూజ లొనరింపుచుండి మరి న్నెటువలెను.

జంపె.

ఒకవేళ వీటికిని ప్రకటానిలము వీచు
ఒకవేళ చూడ్కికిని ఒకవింత యొసగుఁ
ఒకవేళ వివిధపుష్పోజ్జ్వలంబై తోచు
ఒకవేళ కోరికల నొదవించు వేడ్కఁ
యీరీతి సత్యభామారామసీమ తగు
పారిజాతము భక్తపారిజాతంబై.

ఆదితాళం.

యివ్విధంబున సత్యభామకు నింపు సొంపు నింపుచు
పువ్వువిల్తుని గన్నవా డిటు లున్నవేళఁ
నారదుం డటు వచ్చి జిగి చెన్నార దయ నిం
డారఁగ కోరి సత్యాకృష్ణులను కనుగొ నెల్ల వేడ్కఁ
వచ్చినను మునిపతికి నెదురుగ వచ్చి సత్యాకృష్ణులు
యొచ్చె మింతయు లేనిపూజల నుపచరింపఁ.

వ. యిట్లు సత్యాకృష్ణు లొనర్చుపూజ లత్యంతతృప్తుండై సుఖోపవిష్టుండై నారదుండు సత్యభామతో యే మనుచున్నాడు.

ద్వి. కనకాంగి నీదుభాగ్యం బేమి చెప్ప
విను సురభూజంబు పెరటిచెట్టయ్యె
సవతులె కాదు ముజ్జగములలోన
సవ తెవ్వ రిల నీకు చర్చించి చూడ
కావున పుణ్యకాఖ్యవ్రత మీవు
గావింప వలయు నగ్గౌరియు శచియు
ఆవసిష్ఠుని రాణి యనసూయ యాది
గా వనితలు మున్ను గావింప గంటి

వేఁకువజామున వేగ మేల్కాంచి
తేఁకువతోడను తీర్థంబు లాడి
శుచివస్త్రములు గట్టి సురుచిరరత్న
ఖచితభూషణములు గంధమాల్యములు
సవరించి రమణుని సమ్మతితోడ
సవతులిండ్లకు నేఁగి సరగున తెచ్చి
వెరపున పదియారుపేరటాండ్రకును
వరభూషణాద సద్వస్తువు లొసఁగి
పడి చైత్ర శుద్ధ నవమి యాదిగాను
తడవక మాసవ్రతం బొసరించి
అంతట వేదాధ్యయన రహస్యజ్ఞు
సంతతాచారు నాచార్యు వరించి
తగ వ్రతోద్వాస విధాయనవేళ
నగణిత ధనకనకాదు లొసంగి
దక్షత కల్పకతరువుతో విభుని
దక్షిణకముగాను ధార యొసంగి
విప్రుఁ దేయర్థముల్ వేఁడిన నిచ్చి
సుప్రీతి విభుని మెచ్చుగను జేకొంటి
మేలగు తనయ సమృద్ధియు గాంచి
శ్రీలచే వర్ధిల్లి చెలి నీవు పతియు
లీలావినోదకేళీ సుఖోన్నతుల
నందుదు వతిశయ మని నారదుండు
క్రందుగా పుణ్యకాఖ్యవ్రతమహిమ
చెప్పంగ విని సతి చెలువుని నాజ్ఞ
తెప్పున తద్వ్రతదీక్ష వహించె.

అర్ధ చంద్రికలు.

ధర్మజాది బాంధవ వర్గములుఁగా
నందగోప గోబృందంబులునుఁగా

హరియనుమతి వచ్చిరి సిరి యలరఁ
సంభారంబులు సరగున వచ్చెఁ
రైవతకాచలరాజం బందుఁ
దానమంటపము తగ నిర్మించెఁ
విశ్వకర్మయును విశ్వాసమునఁ
సురవిమానములు సోద్యం బయ్యెఁ
పుణ్యకవ్రతాభ్యుదయముతోడఁ.

ఏకతాళిరేకులు.

నారదునాజ్ఞను శౌరి సత్యయును
చారుమంగళస్నాన మొనర్చిరి
శుచివస్త్రంబులు సొరిది దాల్చి మణి
ఖచితభూషణలు క్రమమునఁ బూని
సుందరధరుఁడును మందగమనయు
దిందిమ్మన వ్రతదీక్ష వహించెఁ
పూని దానకల్పోచితమునకును
మౌనియు హరిసమ్మతి ప్రార్థింపఁ
ఆనారదునకు అలరి మంగళ
స్నాన మొనర్చిరి సఖియలు ప్రేమఁ
కనకాంబరములు గట్టి హారములు
ఘనకిరీటము మకరకుండలముల్
రాజాలంకారంబు లొనర్చిరి
రాజాస్యలు మునిరాజున కలరఁ.

అటతాళం.

భద్రదంతావళమునను తాపసులు దాను నిల్చి సౌ
భద్రధర్మజభీమఫల్గుణ బలము గొలువఁ
భూరిభేరీ భాంకరణములు ఘోరు కలగఁ కృష్ణుడు
చేర వచ్చెను దానమంటప శిలమునకుఁ.

ద్వి. ద్రౌపదియును సుభద్రయు వచ్చి రెలమి
దీపితాందోళికా ద్వితయంబునందు
పల్లకీ లెక్కి యాపదియారువేల
పల్లవపాణులు బలసి మున్నడువ
భోజకన్యక వచ్చె భూరిమాణిక్య
భాజనం బైనట్టి పల్లకీ నెక్కి
బంగరందల మెక్కి భామలు గొలువ
శృంగారమున సత్య చెలువున వచ్చి
మంగళాశీర్వాదమహిమలు చెలఁగ
సంగతి బ్రాహ్మణసఖులు దీవింప
పారిజాతపు వృక్ష పట్టభద్రునకు
సారె ప్రదక్షిణార్చనలు గావించి
ధనధాన్య కనక సద్వస్త్ర వర్గంబు
తనియగా భూసురతతికి నొసంగి
ఘన మైనభక్తి గంధమాల్యముల
మునివరుం డగుదేవమునిని పూజించె.

వ. యి ట్లతిభక్తి నమ్మునిని పూజించి వేదోక్తము లైన మంత్రతంత్రంబుల వలన భేరీమృదంగతూర్యరవంబులవలన అమ్మహోత్సవం బనిమిషోత్సవం బయ్యె అపుడు నారదుండు సత్యభామం జూచి యే మనుచున్నాడు.

జంపె.
రమణిరో విభుని ధారాపూర్వకంబుగా
క్రమ మొప్పగా యియ్య గా వలయు వేడ్కఁ
అనిన విని యాసత్య అలతినవ్వును లజ్జ
పెనఁగొనఁగ ప్రాణవిభు ప్రేమమున జూచెఁ
దానవారియు నపుడు దానవారి యొసంగు
మానవతి నన్ను యనుమానంబు విడిచి

యాగమోక్తము గాన అస్మదీయాజ్ఞ యెల
నాగ ధార యొసంగు నారదునకన్న౯
చిరునవ్వు మోమునను చివురింప లజ్జచే
పరమసమ్మోదసంభ్రమలీలతోడ౯.

క. నవచంద్రాళిక యెప్పుడు
నవనీతాళికవిభుని నారదునాజ్ఞ౯
నవచేలాంచలమున నభి
నవకల్పకపుష్ప (పా. నవసురకుసుమముల) సరమున౯ తలఁ జుట్టె౯.

వ. యిట్లు సత్యభామ తనవిభుని వేలుపునెత్తావి విరిసరంబునం జుట్టి గర్గుండు సంకల్పంబు చెప్ప సదక్షిణాకంబుగా పారిజాతవృక్షంబుతో ధారోదక పూర్వకంబుగా ధారవోసె నట యెటువలెను.

ఎకతాళిరేకులు.

నమో నమో సురనారద మునివర నమో నమో హరి నమో నమో.

ద్వి. అని యిట్లు ప్రాణేశు నాహవశత్రు
మునికి సమర్పించి ముదము దీపించ
నారదుండును హరి నవ్వుటాలకును
సారె పనుల్ కొన సాగి చేతికిని
తన కమండలము త్రిదండం బొసంగి
ముని పొమ్ము పొమ్మని ముచ్చట లాడి
రమ్ము రమ్మని కొంత రాయిడి పెట్టి
క్రమ్మర నాత్మేశు కైకొను మబల
యిమ్మెల్ల సొమ్ములు యెలనాగ యనిన
సొమ్ము లెల్ల నొసఁగి సుదతి నాత్మేశు
గైకొనె మణిపుష్పకంబులనుండి
వీఁక కల్పకసుమవృష్టి వర్షించి (పా. నిర్జరుల)
(?)రమలు నచ్చరలాడ దుందుభులు
క్రమమున మొరసె నాగగనమార్గమున.

వ. అప్పు డనసూయా అరుంధతి ప్రముఖులు యాలలు పాడి రట యెటువలెను.

యాలలు.

గొల్లలిండ్లా వెన్న లెల్లా కొల్లలాడి చల్లులాడి
గొల్లపతులతోడ గూడవా వో కృష్ణదేవా
చల్లని చూపుల జూడవా.

రాసకేళిలీలల విలాసముగ విలాసవతు ల
ల్లాసముగ దేలి యాడవా వో కృష్ణదేవా
దోసముల నెల్ల దోలవా.

ధవళం. ధవళం బాడి రట యెటువలెను.

జయ విజయీభవ జయ జయ మాధవ జయ శ్రీభామా
ధవజయ సత్యభామాధవ విజయీభవ
జయ జయ హరిగోవిందా జయ జయ కృష్ణ ముకుందా
జయ జయ నుతసురబృందా జయ కరుణానందా.

దరువు.

రాజగోపాలా రమణీయ గుణశీల
భూజన సురసాల బుద్ధలోల
వైజయంతీ వనమాలికాది వి
భ్రాజితవేష పాపశోష
హరిహరి హరిహరి హరి గోవింద
గిరిధర శ్రీధర కేశవ మాధవ హరిహరి.

వ. అని బహుభంగులం గొనియాడి నారదుం డంతర్హితుం డయ్యె శౌరియు సేనాసమేతుండై సకలసంపత్కరం బైన పురంబు ప్రవేశించి రాజకోటికి వస్త్రమాల్యాభరణంబు లొసగి వీడ్కొలిపి రుక్మిణీసత్యభామాది భామా సహస్రంబులతో యిష్టోపభోగంబు లనుభవింపుచు యాదవసామ్రాజ్యంబు నేలుచు లీలావినోదుండై విహరింపుచుండె మరియు నెటువలెను.

ద్వి. అని జానకీమనోహరునిపేర
హనుమ దాంగద లక్ష్మణావృతుపేర
కోదండదీక్షాది గురువరుపేర
వేదండరక్ష ణావిర్భూతుపేర
సత్యసంకల్ప వాక్చాతుర్యుపేర
నిత్యకృపామృత నీతునిపేర
తారకబ్రహ్మ నాదబ్రహ్ముపేర
శ్రీరాముపేర యాశ్రితరక్షుపేర
కొమరొప్ప గొట్టుముక్కుల కులోన్నతుడు
సమరార్జునుఁడు ధనంజయగోత్రవరుఁడు
విష్ణుభక్తియుతుండు విమలమానసుఁడు
కృష్ణభూవరునకు కీర్తులచేత
వరలిన పెద్దాంబవరతనూజుండు
గరిమను శింగరాట్కవిశేఖరుండు
శ్రావ్యమై తగుపారిజాతాపహరణ
కావ్యంబు యిల యక్షగానంబుగాను
రచియించె చంద్రతారార్కమై మిగుల
ప్రచురంబుగా జగత్ప్రఖ్యాతముగను.

శోభనం.

వసుదేవపుత్రునకు వరనీలగాత్రునకు
అసురకులశత్రునకు అమరమిత్రునకు
నవనీతచోరునకు నవరత్నధారునకు
నవమదనాకారునకు నందకుమారునకు ॥ శోభనమే ॥

మంగళం.

చక్రధారునకు మునిచక్రమందారునకు
వక్రసంహారునకు నాద్యునకునూ
అక్రూరవరదునకు నాదృతద్విరదునకు
శక్రాదివంద్యునకు జయ మంగళం.

శ్రీ ర స్తు

శు భ మ స్తు

# సా వి త్రి ( చ రి త్ర ము )

"(శ్రీ సీ) తాంగనతోడ యొడ్డి సొగటల్ చెల్వొప్పఁగా నాడుచో
దా సామర్థ్యము మీర గెల్చి సతిచేతన్ పంద్యము ... ...
... ... (ప) యంట బట్టి తిగువన్ బై లైనచన్దోయి పే
రాసన్ దప్పక చూచురాముఁ దొసఁగున్ యత్యర్థ యిష్టార్థముల్.

క. పార్వతి పరమేశుని వా
గీర్వరులనుఁ దలఁతు మదిని కేవలభక్తిన్
దుర్వారసరసమేధా
శర్వాల విద్వత్కవీంద్ర గణుతి యొనర్తున్.

శా. గౌరీస్తన్యము లానువేళ దయ శ్రీకంఠుండు గిల్గింత లిం
పై రంజిల్ల నొనర్ప నవ్వునెడ పెల్లై దుగ్ధముల్ క్రేవలన్
జారంగా స్మితశోభగాఁ దలఁచు నా సర్వజ్ఞునిం తల్లికిన్
సారెం జూపుచు ప్రౌఢబాలుఁ డగు యానందుండు యి చ్చిష్టముల్.

ద్విపద.

శ్రీగొట్టు(ట్టి ?)ముక్కల సింహాసనస్థుఁ
డాగమసందర్శి తాచారధనుఁడు
వరధనంజయ(గోత్ర వంశవర్ధనుఁడు)
స్థిరచంద్రవంశ విస్తీర్ణ కరుండు
సంగీత సాహిత్యసద్గుణాలయుఁడు
యింగితజ్ఞుఁడు జనహిత గు ...

రసికుఁ డాకృష్ణమరాజసత్కవికి
అసమానశీల రంగాంబకు సుతుఁడ
కేవల సరసవాగ్విలసుండ రామ
దేవరాజుకు ... ... పుండ
హరిపరాక్రముఁడను హరిదశ్వతేజుఁ
డరిధర కరుణాఢ్యుఁ డతివాగ్విలాసుఁ
డైన కుమారతిమ్మాధిపా ... ...
... ... (పెద్దాద్రి ?) సత్కవిని
రమణతో కాకుస్థరామాంకితముగ
అమరించు నీకథ కాది యె ట్లనిన.

త్రిపుద.

... ... ... చ్చిన చారు మద్రధరిత్రిలోపల
మిగుల మణిపుర మొప్పు పురములో మేటి యనఁగఁ
చాల పరిఘల రథగజంబుల మేలి త ... ...
పూల తోఁటల తోపు తొరవుల బొలుచు మిగులఁ
రాయ రౌతుల రాకుమారుల రాయబారుల ....
కాయ జన్మని క త్తు లనఁదగు కలికి గములఁ
వొప్పు నప్పురి యేలు నెంతయు నోజ లక్షణ భద్రుఁ డెలమిని
చొ .... ఎక మాళ వనియెడు నుదతితోడఁ
పెద్దగాలం బైన బిడ్డల ప్రేమ బడయఁగ లేక మంత్రుల
నుద్ది గనఁదగు ననుచు బలికె నుసూరు మనుచుఁ.

రూపకం.

కొలువులోన వైభవముల కలయ ననుభవించి।యలసి
సొలసి నగరి కరిగి పుత్రుఁ జూచి తేర వలవదే
కొంత నగవు సుంత యే ఢ్పొకింత మోడితోడ యం
తంత వచ్చుబాలు గ్రుచ్చి యలమ వలదె మేనితోఁ
అదరిపాటు చూచి లేచి వదలుగోచితోడ వేచి
పదరు దూటూచి యెనెడు బాలు నెత్త వలవదే

విద్దెవిద్దె మనినలేచి పెద్దప్రొద్దు నిలువలేక
వద్ద తొడల వ్రాలుబాలు ముద్దు జూడ వలవ(దే)
... ... పండ్లు గోర పలుకు తెలక పాలు ద్రావు మనిన
అలిగి తిట్టు బాలు ముద్దు లాడ నాస యౌ గదా.

వ. అనిన రాజునకు మంత్రు ... ...

(గ్రంథపాతం)

... ... ... ... ... ... ... బరరె
మేరై శేషునితీరై కస్తురి చారై మానిని యా రొప్పహహా.

వ. యిట్టి మనోహరం బగు నవయవ్వనంబున నొప్పు గుణచాతురి యగు కూతురిం జూచి వివాహంబు సేయం దలంచి మాళవి లక్షణభద్రులు తమలో నేమని వితర్కింపుచున్నారు.

జంపె.

మూఁడులోకములందు యీ డనఁగ దీనిసరి
యాఁడుబుట్టుగలు గలరా యెందు నైనఁ
తగినవరు వేదకి తేఁ దగునైన దుర్ఘటము
మగువ యెరిగిన రాకుమారకులలోనఁ
వలను మీరంగ స్వయంవరము చాటించినను
కలహమై భూమి చీకాకౌ తలంపఁ
చిత్రపటమున నైన చెలికి శోభన ...
మిత్రులకు సమ్మదము మేలిమియు గలుగుఁ.

ద్వి. అని యిట్లు దంపతుల్ ఆత్మ చింతించి
క్షణములోనన చిత్రకారులఁ బిల్చి
... ... చప్పన్నదేశంబు లరిగి
వరభూపతి కుమారవర్గరూపములు
కొదవ లేక లిఖియించి కొని రండు పొండు
పదినాళ్ల దెచ్చిన పసదనం బిచ్చి

... ... న నరిగి యామితినె
చని చిత్రపటము దే సంతసం బంది
తాను భార్యయు పుత్రి తగినశిల్పకులు
పూనిక శుభలక్ష ... ... ... ...
... ... గు కూఁతురి కిట్టు లనియె నవ్విభుఁడు
తనయ నీకును పెండ్లి తగఁ జేయఁగోరి
ధరఁ గలరాజు లందర బేరు వేర
తెరగొప్ప వ్రా ... ... ...
... ... ... నచ్చిన మంచి మగని వరించు
మని వారిపేరులు నన్వయంబులును
తెలుప శిల్పులఁ బంచి తెర వుచ్చి పటము
తలఁగక మున్నె ... ... ... .

వ. రాజకుమారులం జూచు కన్యారత్నంబునకు చిత్రకారు లేమనుచున్నారు.

జంపె.

బంగాళ నేపాళ పాండ్యమాగధవత్స
వం ... ... ... ... వీరల్
లాట మరహాట కర్ణాట సింహాళ మత్స్య
ఘోట కాశ్మీర భూభుజులు బలవీరుల్
కురువరాటమరాట కొంక ... ...
... ... పౌండ్రధరణిపులు వీరల్.

ఏకతాళి.

అని వినిపించిన మనమున కొంకరుఁడు
గనుపట్టక తిరి గటు కనుగొన ...
... ... ... న్నత మగు యెగు భుజములు
సొగసగుజిగమేను పొగడం దగుచుఁ
సత్యవంతుం డనుజనపతి దగు నని
మత్యకలం ... ... గోరెఁ.

వ. కోరి చిత్రకారులం జూచి యే మనుచున్నది.

క. వీ రెవరో యేది దేశమొ
పే రెయ్యదొ యితఁడె తనకు పెనిమిటి యింకన్
... పంపుఁడు తడయకుఁ
డీ రనినను శీఘ్ర దోలఁక నేఁగ వసతికిన్.

త్రిపుద.

అంత జననీజనకు లాత్మల సంతసంబున బొదలి కూఁతురి
చింతపడవల దనుచు పలుమరు జెప్పి ప్రీతిన్
యెల్లి మంచి ముహూర్త మిప్పుడ యేఁగి నీవిభు తోడి తేరఁగ
తల్లి ! మంత్రుల బనుతు ననుచును తగవు మెరయన్
తాను కొలువుకు వచ్చి రాజులు వెనవేల్ గొలువంగ నున్నెడ
మానుగా నారదుఁడు వచ్చెను మహివుఁ డలరి
గద్దె నిడి యర్ఘ్యాదిపూజలు కర మొనర్చెను కుశల మడుగుచు
ముద్దుసుత యున్నెడకు దానును మునియు గూడన్
వచ్చినను సావిత్రి మౌనికి వందనం బిడి నిలిచియున్నెడ
యిచ్చ నలరుచు రాజు మౌనికి నిట్టు లనియెన్.

ఏకతాళి.

కాంతామణి యీకామిని యల సత్య
వంతుని గోరెను వరుఁడుగ దనకున్
మూఁడులోకముల వోఁడిమి తెలియని
వాఁడు లేఁడె దేవర కటు గనకన్
తగువరుఁడే కద తరళాక్షికిని
దగవగునా యా ధరణీపతికిన్.

వ. అనిన ముహూర్తమాత్రంబు తనలో విచారించి నారదుం డా రాజున కేమనుచున్నాడు.

ఆటతాళం.

చక్కదనమును రాజ్యసంపద శాంతి దాంతిఁ రాజుల
కెక్కుడనదగువాఁడు విధికృతహీనవృత్తిఁ
కందమూలము లాకులలములు కాయకసరుల్ నమలుచు
కొందలంబున జననిజనకులఁ గూడి యడవిఁ
... ... భ్రష్టుఁడై చరించును రాజ యదియుఁ దాకను
పూజ్య మాయువు యేఁటిమీఁదట బొంకు గాదు
పెక్కు రాజకుమారు ... ... కోరఁ యేటికి
స్రుక్కు కొరు వరియింప బనుపుము సుత నటన్నఁ.

వ. అనుపలుకుల కులికి పకి ? యే మనుచున్నది.

జంపె.

(దేవమౌనిని జూ)చి దేవరకుఁ దగు నయ్య
యీవిధమునను బల్క విదియు ధర్మంబె
జనయితారులు బంప మన పిచ్చి పతి దొ ?
... ... ... కులటనె తలంపఁ
పతి పేదవాఁడైన పరమకష్టుండైనను
మతిహీనుఁడైన సోమరి యాయె నేమి ?
కుంపైన గుదపైన కోపగాఁ డైనను
... ... (కా)ంత గైకొనినఁ
ధనము బోకార్చినను తాగి జూదగాఁ డైన
పని కేమిటికి గాక పాలుమాలినను
తల్లి దండ్రియు గురువు దా ... ...
... ... లు సతికి యేడుగడ యతఁడు.

వ. మరియు పతివ్రతాలక్షణం బెటువలె తెలుపుచున్నది.

జంపె.

ఘనపతివ్రతలకును .... శయంబైన అనుపమగుణంబుల్
నారదా సహధర్మచార దా నగు నేని
సారదా భయరుజలు మీరదా కీర్తుల్

.... ... ... తయై చనవిచ్చు
చెల్లిగా వేశ్యయై చెనకు పతిరతికిఁ
ధనములను గొల్లయై దాఁచు కార్యమువేళ
గ ... ... ఘనత మెరయఁగను
పనులయెడ దాసియై బాగైన యీయారు
గుణములను విలసిల్లు కొమ్మ నుతి కెక్కుఁ.

- టంక.

మగడు జలక మాడి కుడిచి తగ నలంకృతుఁడు గాక
మిగుల తాను చొరవ దెంత నొగిలి బడలె నేనియుఁ
పతికి (వేళ వే)ల కొదవ బాగ చవిగ కూడు కూర
లితవు మీర తానె వండు నెలమి బనుప దొక్కరిఁ
కాంతుచెలిమి గలిగి యున్న కన్నకొడుకులట్లు జూ చొ
కింత వెరసు జేసె నేని విడుచు బంధు నేనియుఁ
పురుషు డొండు కడకు జనిన సరసగంధమాల్యములను
సురుచిరంపు భూషణముల సొరిది దాల్ప దెంతయుఁ
నగవుబలుకు పెలుచ నొట మిగిలి వాకిటికిని జనుట
తగని జారమైత్రికలను విగుడ నీ దొకప్పుడుఁ.

ఝంపె.

పొరుగు యిరుగిండ్లకును పోదు కట్టితి గాదు
కొరకొరల సణఁగు గొణఁగుల శిణుఁగ దెపుడుఁ
పతి దెచ్చు కూరాకు పరమలాభము గాఁగ
మతి దలఁచు పరధనము మంటిసరిఁ జూచుఁ
పరపురుషు తృణముగా భావించు తనవిభుఁడు
తిరుగాడు దాశైన దేవిగా నెంచుఁ
పతి తీర్చి దిద్దగలపని కతని కూరటగ
సతతంబు దాను వేసరక పరికించుఁ
చరిత మగు పనులకును చొరదు కలలో నైన
పరుషములు పలుక దేమరిపాటు నైనఁ

యిరువంకచుట్టముల పరిపాటి భాషించు
వరువుడుల బిడ్డలుగ వాంఛ బరికించుఁ
యెన్న యీపదిరెండు హెచ్చు గుణములచేత
వన్నె కెక్కును పతివ్రత యన ధరిత్రిఁ.

వ. అని గుణహీనురాలి నడక లేమని వర్ణింపుచున్నది.

రూపకం.

... దిట్ట మిట్టి నడక కట్టి పెట్టి పొట్ట క్రొవ్వి
తిట్టు రట్టు కోర్చువనిత పుట్టు చుట్ట గాడి దగుచు
పిక్క తక్క లెక్క జెప్పి తక్కి రొక్క మెత్తి మగని
... ... మగువ బుట్టు మర్కటంబుగాను
అంది పొందువారు సంది గొందివారు దిట్ట పతికి
మందు బెట్టు సుంద రూరబంది చం ...

త్రిపుద.

కాంతుతో కలహించుకామిని కాట్లకుక్కై పొదము పుడమిని
మంతనమునకు చొరవ యియ్యని మగు ... ...
మగఁడు కుడువక మునుపు దినుసతి మాలకాకై యుద్భవించును
మిగుల బొంకిన గుంటనక్కయి మెలఁత బుట్టు కురూపియై
భర్త ... ... ... ... లా కముగా జనించును
ధూర్తయై పోరాడుమానిని దొంతి యెలుఁగై పుట్టును
దిట్టయై పతిపట్టులను చెలి కట్టిడై పొట్టార బె ...
... ... ... బొట్టలు బెట్టుగా జూపట్టగాఁ
అంతకంతకు విభుని కదుకక వింత పొరుగిరుగిండ్ల కేఁగిన
కాంత దాసరిపా మగుఁ బ ... ... ... .

వ. అని మరి న్నేమనుచున్నది.

జంపె.

అత్తయెడ బత్తి మది మెత్త నగునేని వెర
యొత్తి కా ళ్లొత్తుకొను తిత్తి రయి బుట్టుఁ

కొ ... ... ... ... ... జూడకను
కాడు కడ బూడిదలొ గాడిదయి పొరలుఁ
తోడికోడండ్రతో గూడి మాటాడకను
పాడడ విజి ... ... ... బుట్టుఁ.

త్రిపుద.

అనుచు సతిగుణదుర్గుణంబులు ఘనతఁ బలికినబాలఁ గనుగొని
ముని మనంబున వినుతి సేయు ... ... ముతోడఁ
జనకసుత సంయాతినందన శచియు లోపాముద్ర రోహిణి
అనఘ చంద్రమతీ యరుంధతి యత్రి గృహిణి
పార్వతియు స్వాహాంగనామణి భారతీసతి రమయు మొదలగు
పూర్వసాధ్వుల మించు ననఁదగి పొలుచు జగతిఁ.

అర్ధ చంద్రికలు.

అని జనవిభుతో ముని ఘనరీతిఁ
సతిగుణజాలము సకలము దెలుపఁ
తల యూచుచు మేన పులకలు బొడమఁ
వేమరు ప్రేమము లామని శేయఁ
అద్భుతరసమగ్నాత్మకుఁ డైనఁ
మునిపతి జనపతి కనుఁగొని పలికెఁ
వనితకు వేగ వివాహము శేయఁ
చానగూర్పుము శుభఘనవస్తువులఁ
అని యంతర్హితుఁ డై చన విభుఁడుఁ
ఆస్థానమునకు అరుదెంచచటఁ
మంత్రి పురోహిత మాన్యులతోడఁ
కన్యా గుణగణ గౌరవమహిమల్
వినిపించిన కడు విస్మితు లగుచుఁ
ఉన్న కనుంగొని యుర్వీధవుఁడుఁ
వైవాహికశుభవస్తుచయంబుల్
తెప్పించెను అతి తీవ్రముతోడఁ.

వ. యివ్విధంబున సకలవస్తుసంపన్నం బగుటకు సంతసిల్లి పురోహితామాత్య వరులతో విచారించి అభిగమ్యకన్యాదానం బుత్తమోత్తమం బగుట నిశ్చయించి కన్యారత్నంబు నలంకరించి యేక్రమాన చనుచున్నారు.

అటతాళం.

రత్నరాజిత మైనపల్లకి రాజపుత్త్రి యెక్కి ప్ర
 యత్నశీలత వెడలె రాజును హయము నెక్కి
శోభనద్రవ్యములు మును ... సొరిది నడవఁగ అయిదువ
 శోభనంబుల పాటలను శ్రుతిసుఖము గాఁగఁ
భేరిభూరిరవంబు దెసలను భోరు కలగఁగ సేనల
 ... ... ... రము మీర నొయ్యారముగను
నడచి యల్లునియాశ్రమముదరి విడియ బనిచి మంత్రుల
 పుడమివిభుఁడు పదా ... ... తపృత్తిఁగ
వచ్చి యారాజర్షి పూజలు వరుసతోడఁగ గైకొని
 యిచ్చ నన్యోన్యమును సేమము లెరిఁగి పిదపఁగ.

వ. ... ... ... తొ మంత్రు లే మనుచున్నారు.

ద్వి. ధరణీశ ! నీపుత్త్రి ధర్మచారిత్రు
వరరూపయుతు సత్యవంతుని పతిగ
వరియించె మాభూమి ... ...
... ... సద్గుణగణ్య సావిత్రికన్య
అన విని హర్షించి యంతలో చింత
మునిఁగి మంత్రులఁ జూచి ముచ్చిరి బలికె
మాతోడ కూరాకు మసల ... ...
... ... ... తించు యిది పోలు నెట్లు
అనుటయు ప్రెగ్గడ లాబాలసాధ్వి
గుణగరిమంబుల కొలఁది తెల్పుటయు
మనమున నుబ్బుచు .......
...... ముని తోడ్తెచ్చి తనయల్లునికిని
ఘనత నలంకృతి గావించి తపసి

జనుల గూరిచి యగ్నిసాక్షికంబుగను
తనయ కుద్వాహంబు . . . . .
అనుపమంబుగ నిచ్చె అరణంబు గాఁగ
పదివేలగజము లిర్వదివేల హయము
లెదుగ భూషణము లెంతే . . . . .
. . . లక్షధేనువు లిరులక్షలభటులు
పక్షంబుతో లక్షపరిచారికలను
యిట్లొసంగి మహీశుఁ డెలమి వీడ్కొనెడు
పట్లన . . . . . మామపజ్జనె నిలిపి
వలయునప్పుడు గొనివచ్చెద మనుచు
సొలవక బంపిన శోకతోఁ జనియె.

త్రిపుద.

అంత నెంతయు సంతసంబున కాంత కాఁతుని కలసి మెలసి ని
రంతరంబును చింతవంతల నింతయైన కలంగకన్
ఆదిగర్భేశ్వరియు నయ్యును మోదమున కూరాకు నమలుచు
ఆడుకొని పను లెల్ల జేయుచు అత్తమామలు మెచ్చఁగాన్
దేవపూజల కతిథిపూజల కేది గావలె నట్టి యప్పుడె
భావమున చింతింప రటు మును ప్రౌఢి ముందర నిలుపును.

అటతాళరేకులు.

నీతికిన్ యతిభూతికిన్ సతిజాతికిన్ తగుయూఁతగాన్
చాతురిన్ శుభరీతినిన్ పతికేతరిన్ మనసిచ్చును
వేయురీతుల మామకున్ తగునాయసరణిని పాయకన్
తోయజాస్య యమేయయై పూజసేయు నెంతయు బాయకున్
హత్తి సద్గుణవృత్తితో కడు బత్తి మదిలో జొత్తిలంగను
అత్తకున్ సుగుణాత్తకున్ మృదుచిత్తకున్ పదమొత్తును.

వ. మరియు సత్యవంతునెడ యెటువలె వర్తింపుచున్నది.

జంపె.

పండుటాకుల వేఁడి బహుళ మాయ నటన్న
నిండువేడుక పయట నిలిచి యటు విసరున్

పగలైన తా తెచ్చు ఫలమూలములు జూడ
మగువది దేవలె ననిన మాటలో దెచ్చుచున్
పొడలెత్తి నివ్వరులు వడిసడింపగ బిల్వ
విడిచి మరలును మునల మిడ బడక నిలుచున్
యువతితోడ తలగడగ యొరగి పతి నిద్రింప
రవిసంధ్యవేళకె రాఁడు సతికళికి.

వ. మరి న్నెటువలెను.

**అటతాళం.**

మగువ ప్రొద్దున మేలుకని ముఖమజ్జనంబై సవితుని
పొగడి వందన మాచరించుచు పూజ లొసఁగి
అత్తమామల చరణయుగళికి అధికభక్తి మ్రొక్కిన
ఉత్తమోత్తమమైన దీవన లొసఁగ ప్రీతిన్
అను . . . . . . . కలదు సలుపన్ వలయును
తెలివి మీర యనుజ్ఞ యొసగుఁడు వెలయువేడ్కన్
అనుచు వేఁడిన హర్ష మందుచు యత్తమామల్ . . .
ఘనత సలుపుము దీన నీకును గలుగు శుభముల్.

వ. యివ్విధంబున యనుజ్ఞ గొని వ్రతం బేక్రమాన నడపుచున్నది.

**జంపె.**

తరుణి బ్రా . . . ర్తముననె మేల్కాంచి
శిరసు మజ్జన మగుచు యిరుగు . . . నిలిచి
కలుగు భూషణరాజి కైసేసి పాటించి
చెలి భవనదేవతల నెలమి ప్రా(ర్థించున్)
. . . . . . . సంతర్పణం బాచరింపఁగ జేసి
పతి కత్తమామలకు బహుతృప్తిఁ జేసి
తాను నిర్జలముగా తగ నుపవసింపుచును
పూని వ్రత మి . . . . . . . మూన్నాళ్లున్
ఆదినమునను వనికి నరుగు తనవిభుఁ జూచి
మోదమున యిరుగురుల మ్రొక్కి యి ట్లనియెన్

అయ్య! నీ(పుత్రు డిపు) డడవికిని జనియెడును
చయ్యనను వెంబడిగ జనియెదను నేనుఁ.

వ. అనిన నా వృద్ధదంపతు లేమనుచున్నారు.

రూపక.

అమ్మ! మూఁ[డు ది]నము లెంత యలసి బడలితో గదే
కమ్మి యాఁక లింత నిన్ను గాశి జేయ కుండునే
యెల్లి యారగించి బడలి కెల్ల దీర్చి మోద మంది
తల్లి! జనెదు గాని పడుచ! తత్తరిలక నిలగదే
అనిన ముద్దువుట్ట మ్రొక్కి అంత కంత వినయ మెక్క
వనిత కొసరి వేఁడుటయును వారు సమ్మతించినఁ
ప్రాణనాథువెంట యేల బాల! యే మదాటలా?
పీఁచెపాటలా? తలంప వింత పూలతోఁటలా?
మిట్ట గుట్ట ముండ్లు గుండ్లు మేర మీరు పొదలు భీ
తుట్టఁ జేయు పాము గాము లెందు సందడించును
వలదు వేగ వత్తు ననిన వలపు బుట్ట కౌఁగిలించి
కలికి కొసరి ముద్దు వెట్ట కాంతుఁ డనుమతించెను.

వ. యివ్విధంబున ననుమతి వడసి భర్త ననుసరించె నట యెటువలెను.

ద్వి. అంత కాంతామణి హర్షంబు నొంద
కాంతారవిభవంబు గణుతించి పలికె
పనస పిప్పల బిల్వ పాటలీ వకుళ
తినిశ జంబూ నింబ తిందు కాశోక
వట మధూక రసాల వంజుల నీప
కుటజ భల్లాతకీ కోవిదారముల
మల్లికా మాలతీ మాధవి జాజి
సల్లకి కరవీర చమ్పక నాగ
కురువింద కేతకి కుంద కాస్మీర
గురు కురంటక ముఖకోటుల మించి
కుసుమితకిసలిత కుట్మలితాతి

రసవత్సలిత వనరాజి గాన్పించి
మాతంగకేసరి మార్జాలకీశ
కైతవభుజగాది నామ సంగ్రామ
బంధవిశేషముల్ పడఁతికిఁ జూపి
బంధురంబుగ పకపక నవ్వుకొనుచు
వనములో వింతలు వనితకుఁ జూపు
కొనుచు శ్రమం బొంది గుంపయివేర్చి
గుజ్జుమామిడినీడ కోరి యూరువులు
తజ్జలజేక్షణ తలగడఁ జేయ
పవడించి యుసు రన పయఁటకొంగునను
యువిద మెల్లన వీచుచుండె నున్నంత.

అర్ధ చంద్రికలు.

బడలి కగ్గల మనుచు తడబడుచు నుడువుఁ
తొడిబడను కనువిచ్చి కుడియడమఁ జూచుఁ
అసురుసురు మని శి . . . . . . పరుచుఁ
బుసబుసన శ్వసనముల నెసఁగె విసవిసను
దంతముల వింతనలు పంతఁ జూపట్టెఁ
స్వాంత మత్యంత . . . . . . త వహించెఁ
స్వేద మెద జాదుకొని మేదురము గాఁగఁ
పాదుకొని నేదు రగు వాదముల మాటల్
రెప్ప లల్లార్చ కటు వుప్పర మెం . . . . . .
. . . . . . ప్పి యని చెప్ప వావిచ్చి గాండ్రించుఁ
పుష్టియును చేష్టలకు నష్టమయి వచ్చెఁ
దుష్టమగు కష్టమును స్పష్టమయి నిలిచెఁ
అ . . . . . . . . . మదిని యింత చింతిలకఁ
కాంతువంతకు మౌని మంతనము దలఁచెఁ.

వ. యివ్విధంబున దలచి యువతి భక్తైక సహ . . . గ్గక చూచుచున్నంత్.

జంపె.

అంతకునిమాత లటు యరుదెంచి చూచి యె
ల్లంతనంతనె నిల్చి యరిగి రతిభీతిఁ
దూతాధికార్లు విని . . . . . . . . . . చి
వే తిరిగి పరచి రతిభీతి నలుగడకుఁ
దాని విని కాలుండు పూని యాయత్తమయి
మానవతి దర్శించి మగుడె పెరత్రోవఁ
[అది] చూచి కోపించి యార్చి మృత్యువు వచ్చి
అదరి వెనుదివె లేక యామడనె నిలిచెఁ
కర్మాధిదేవతయు కాంతాళమున వచ్చి
పేర్మి చెడి పారె నొక పెరత్రోవ బట్టి
దాని కని విని క్రోధ తామ్రాక్షుఁడై యముఁడు
పూని భటులతో వచ్చి పొన్నంత నిలిచెఁ
అది సన్నసైగ గని మది మచ్చరం బెచ్చ
అదలించి ధర్మరా జరుదెంచె యవలఁ.

త్రిపద.

పిలిచి వేగమె చిత్ర గుప్తుని కలయ బిలిచి వితాక బోవుచు
తెలివి దప్పదె వీని మితి కీపినము సరియె
హరుని మిక్కిలి కంటఁ బుట్టిన యనలమో కా దౌర్వశిఖియో
శరధిఁ బుట్టినకాలకూటమొ శంబ మగునో
తేరి చూడగ రాదు మదిలో దిగులునను చేకాళ్లు వడఁకెను
పారిపోవలె ననెడుబుద్ధియు పట్టువడియెఁ
అనుచు చింతిలుయముని కి ట్లను యమ(దు?)క వాపుచు చిత్రగుప్తుఁడు
ఘనపతివ్రత దీన నీ కీకలఁక బుట్టెఁ
వంచనను నే పొంచి వెనకకు వచ్చి పట్ట జయంబు గైకొని
కంచుమించుగ పారుదా మన కడఁక నటులఁ.

వ. యివ్విధంబున సత్యవంతునిం గొనిపోవుటం జూచి యతని శరీరంబు రసాలకిసలయమృదుశయ్యాతలంబున నునిచి తిరోహితుంగా జేశి శమను వెనుకొనియె నట యెటులనెను.

అటతాళం.

రవికెముడి బిగియించి పయ్యెద దివిచి వేగఁగా పురిగొని
యువతి కుచ్చెల యిరియ నడిమికి యొప్పఁ జుట్టెఁగా
కొప్పు విడిచి కీలుగం టిడి కొమ్మ శమనుఁగా వెనుకొని
తప్ప గ్రుంకియు వలియఁ బారియు దాఁగి జుణిఁగి
మలకలుగ వెన బారి పారియు మరలి జూచూ నంతకుఁగా
నెలఁత గుదు లటు ద్రొక్కిఁకొంచును నిలిచె నెదుటఁగా
దెబ్బపో రిది ప్రాప్త మయ్యెను దెప్పరఁబూ యిది పెద
బెబ్బు లన దగి వెంట నంటెను వృదుల నీదు.

వ. అని తలపోసి యప్పతివ్రతాతిలకంబుతో నే మనుచున్నాడు.

రూపకం.

అకట! వరములు మూడు ప్రకటముగ (నీ) కిత్తు
నికటముగ జేకూరు నొకట పతి దక్కఁగా
ఘనమానవతి వినుము ఘనమాన నేదైన
అనుమాన ముడి గడుగు చనుమానముగను
. . . . . . . ననాథసుతుఁ డిట్టు లన నాతి కపటనం
జననాత్మయై తలఁపునను నాలివగను
యిచ్చినది బుచ్చుకొని మచ్చరము హెచ్చ పతి
దెచ్చెద . . . . . . . . . చ్చు దన కనుచుఁగా.

వ. ఆదండధరునితో నే మనుచున్నది.

ఎకతాళి.

చంక శిశువు నిడి జారఁగ విడువకు
వింక కడమ బడ సీడ దగ దనఘా!
యి . . . . . . . . . . ని మ్మరుసుగ నయనము
లిరువుగ నొకటికి ధర నుతి కెక్కఁగా
బూములు గా దిది పోలఁగ వినుమా
బూములు మము బొంది పొసఁగునా . . .
అతిబలయుతులను శతసోదరులను

చతురత నొకటికి జను నొసగంగ
అన విని ఘన మగు నెనరున నొసఁగితి
చను మని శమనుఁడు శా . . . . . .
అంత శమనుఁ డిటు లంతర్హితుఁ డగు
డింతి యముని గాన కిట్లని పలికె
యేను పతివ్రత నేని కృతాంతుఁడు
కానుపించు నా కను . . . . . . . . .

వ. అని పలికి పరచుకాలునిం గని వెంట నంటె నట యేటువలెను.

రూపకరేకులు.

తిరిగి తిరిగి చూచు చరుగు తరణిసూ . . . ణి జేర
పరసుముండ్లు గుండ్లు మొరప కరకు నెరపె తెరువుదరిని
పులులు సలుగు లెలుగు లేనుగలును శలలి చిలువబాల
శలలు చరులు దరులు కారు లిచ్చు లెచ్చు బెట్టె నెదుట
మెరుము లురుము లెచ్చ కరకు లురుల జొచ్చె మచ్చరించి
తొరిగె జోరు మనుచు వాన పరగె పంకసంకటములు
అవియు దవుల దవుల దొలగ నువిద తవుల బడక కడక
పవి యనంగ వెంట నంటె దివులు మివుల బుట్టి మరలె
నిలిచి సోలి వెలుకఁబారి కలఁగి కలికి కనతనమున
కలరి తెలివి నొంది వేడ్కఁ జెలువు నెలకొనంగ బలికె
వరము గోరు నరుని దక్కఁ నెరసి యరసి మరలి రాకు
తరుణి యనిన చింత కొంత తడవు తడచి తెరఁగు గాంచి
జియ్య ! తియ్య మొంద మీర వియ్యు డయ్య నెయ్య మొప్ప
నొయ్య పుత్రశతము గనఁగ నయ్యప్రీతి నాదుమదికి
అనుచు ననుచువేడ్కఁ గోర నినుచకృపను వినుచు నొసఁగి
చనుము మాముకడ కటన్న సకియ నగవు మిగుల ననియె.

గీ. ధర్మరాజ వయ్యు తగు తగ దని గాన
కిట్లు వలుక దగునె హేయ మనశ

వరము గొనుచు నేఁగి వరహీనవై యట్లు
పుత్రశతము గాంతు పూతచరిత!

వ. అని మరి న్నేమనుచున్నది.

జంపె.

పతిరహిత యైనసతి యతిబలులఁ గనిన ద
త్సుతుల గోళకు లనుచు సుతియనియ రెందుఁగా
సారె బాలకజనము గిరు కుంచము లాడ
పూరిపొత్తుల కుంచ మో యనుచు నాడుఁగా
కరుణ నీ వాసగుధర పరిపాలనము శేయ
కర మయోగ్యు లటంచు గైకొనరు మంత్రుల్.

రూపకం.

భర్తహీన యైనయువతిబ్రదుకు బ్రదుకె శమన! యా
వార్త వినఁగఁ గోరె దేని వరుస వినుము చెప్పెదఁగా
బాల్యమునను తల్లిదండ్రి పరగ జవ్వనమున భర్త
తుల్యవార్ధకమున సుతుఁడు తొయ్యలికిని పోషకుల్
కాన పు(ణ్యవ)తికి దక్క కాంతుహీన యైనసతికి
పూని భోగ మనుభవింప బొందు నింద కుదురుగాను
పసపు బాశి రోశి చెవులు బాగ వెలవె ... మ్ము
దొసఁగ దోశి చీర మాశి వెస చరింపఁగా దగుఁగా
శుభము శోభనములవేళ సొరిది పయనగతులవేళ
విభుఁడు మరలువేళ య ... డు విధవకుఁగా
పరిమెళముల మాని పస్తు బారతాల కాని చీర
విరివి ముసుగు బూని లేని విడెము వ్రతములే దగుఁగా
ఉదరపూర్తిగా ... ల ముడిగి తిరుగు గాక
యెదుగ మాటలాడ బోక యిల చరింపగా దగుఁగా
వెలిని ముద్దులాడ గూడ దలమి బాలు మోము చూచి
పలుక రా ... ... ... నళుకు లేక విధవకుఁగా

విధవదీపె నొందిరైన వేగి మోము చూచిరైన
వ్యథలు వృథగ బొందు ననుచు నార్యులెంతు రెప్పుడున్
యిట్టి చ(చె ?)ట్ట వాలకమున పట్టి .... కొన్న
తిట్టు రట్టు నిన్ను నన్ను వెట్టు వొంద గుట్టు విడన్.

గీ. అనిన వెలుకబారి యాననంబున శుష్క
హసిత మొప్ప మిగుల నద్భుతముగ
తను నవజ్ఞ ... ... లాక్షిప్రౌఢిమం
బనుచు నిచ్చ మెచ్చి యబల కనియె.

త్రిపుద.

అబల! నీవు మహాపతివ్రత వౌట నిను నే చాల మెచ్చితి
ప్రబలవరముల (నొ) సగెదను నీ పతియుతముగన్
ఆయురారోగ్యమును భాగ్యము ఆత్మజుల ధనధాన్యబంధుల
మేయరాజ్యము పాఁడి పంటయు మిగుల గలుగున్
రయమునను జను మామకడకును రాజముఖి! నీపతిని దోకొని
నయముగా యెల్లిటికి జేకురు నాదువరముల్
అనిన ముప్పిరి గొనెడువేడుక నాత్మలో నుప్పొంగి వీడ్కొని
చని రసాలముక్రింద పల్లవశయ్య జేశి
చివురుసెజ్జను ధవుని తనతొడ యువిద తలగడ జేశి యున్నెడ
మిగుల భీతిని నిద్ర మేల్కొనుమేర లేచెన్.

వ. యివ్విధంబున లేచి భయకంపితశరీరుండై సత్యవంతుండు సావిత్రితో నే మనుచున్నాడు.

జంపె.

కొరగానికల గంటి తరుణి యాకలతెరఁగు
యెరుక పరుపఁగ రాదు యేమి భామలకున్
పురుషులతొ జెప్పినను పొంద వాపదలు ద
త్పరత మనరాజుకడఁ దగ విన్నవింతున్
ఫలమూల(ముల) నీవు భరియింపు మింధనము
బెలిమి నే దెత్తు నని యెత్తుకొని వేగన్

ఆశ్రమంబునకు వై యరుదేర మధ్యమున
విశ్రమించె నినుండు వేగ నపరాబ్ధిఁ.

వ. యివ్విధంబున సూర్యాస్తమయం బగుటయు పొదరింట చంద్రకాంతశిలా తలంబున సతీసమేతుండై యారాత్రి గడపి వేకువ సావిత్రీసహితుండై కదలి యాశ్రమసమీపంబునకు వచ్చునప్పు డడుగుచప్పుడు విని యావృద్ధ దంపతు లే మనుచున్నారు.

రూపకం.

తండ్రి! సత్యవంత! యింత తడవు విడువ కొడుక! యే
మండ్రు నిన్ను యొరులు గలరె యరయ మమ్ము పరిజనుల్
అని నయమును భయము మనములో బెనగొనంగ
యనఘ! నిరపరాధి నే యర్థ్మజనుఁడ కరుణకుఁ
వినుము కందమూలఫలము లెనయుపండుటాకులుఁ
గొనుచు మరలువేళ బడలి కుజమునీడ నిలిచితిఁ
నిలిచి యొడలు మరచి నిదుర తెలివి దప్పి యున్నయెడను
కలను బలియుఁ డొకఁడు పట్టి కట్టి కొట్టె బెట్టుగాఁ
అంత విడక కొంచు నేగ యబల యోర్తు కూడ ముట్టి
యెంత యేని సాంత్వనముల నేకమాన నను మరల్చె
యిట్టిచెట్టకలకు భీతి బిట్టు మేలుకాంచి లలన
చెట్టపట్టి వెడల తమము (చెట్టు చుట్టె నొట్టడవిని.

వ. అని యివ్విధంబున తడయుటకుం గారణంబుగా దుస్వప్నంబు చెప్పిన విఠాక బోవు నమ్మహీవల్లభుతో సావిత్రి యే మనుచున్నది.

ద్వి. విన .... ద్ర! విశదంబు గాఁగ
తనరఁగ చిత్తావధానుండ వగుచు
తాను పుట్టింటను తగు జవ్వనమున
వేనవేల్ నుతియింప వేడ్కఁ నుండుటయు
పతి గాఁగ యీసత్యవంతు గోరుటయు
హితమతితోడ లోకైకపూజ్యుండు
వనజీసంభవుపట్టి మహతి మ్రోయించు

కొనుచు వచ్చుటయు మీ కొడు కాయు వేఁడు
అని యడుగఁగ వేసండరక్షకుని
ఘనదాసుఁ డరిగిన క్షణ మాని గాఁగ
లలితంబుగా దినరాజి నెన్నుటయు
పొలుచు నిన్నటికి యా మునిపల్కుమితియు
అరుదెంచ ... విన రా సత్యవంతు
కరమైన కలభంగి కాలు మెప్పించి
వరములు నాలుగు వడి బడయుటయు
తెరగొప్ప నొకటికి దేవరకండ్లు
వొకటికి మనరాజ్య మొకటికి నూర్గు
రకలంకసోదరు లరసి యొక్కటికి
బలపరాక్రమనిధుల్ పాండిత్యధనులు
నలరూపులను మనునయ విశారదుల
యెలమి పుత్రకులు ప్రాపించు నూర్గురిని
వెలయంగ తమకును వేఁడుకొంటయును
మొదలుగా మును విన్నమునివాక్యసరణి
సదయుఁ డా సమవర్తి చర్యాంతముగను
యొగి నంత దెలుప నెంతో సంతసించి
మిగుల నుబ్బుచు నుండె మెరశి యెవ్వేళ.

అర్ధ చంద్రికలు.

అన్ను దలమిన్న యిటు విన్నపము శేయఁగా
కన్నులను తిన్నని ప్రసన్నత వహించెఁగా
అందులకు తుందిలానంద మెద జాలఁగా
జెందుతరి బృందముగ విందు లన వేడ్కఁగా
దిగ్గునను ప్రెగ్గడలు డగ్గరికి జేరి
ప్రగ్గె పగ జగ్గు మను యగ్గలికతోడఁగా
కొంచక నుతించ నటు వేంచేయుఁ డనినఁగా
యెంచను దలంచ రా నించునఁ జలంగఁగా
నక్రహర శుక్రదృగవక్ర చతురాస్యుల్

శక్ర సకలక్రతుభుజిక్రములతోడఁ
వేడుకను గూడి పరిగూడి చనుదేరఁ
యీడు మరి జూడు యిక నెడదను ప్రీతిఁ
యెదురు సని పదములకు సుదతి మును గాంగఁ
యెదుగ భయభక్తులను ముదమునను మ్రొక్కఁ.

వ. అంత సావిత్రి చేరం బిలిచి వాసుదేవుం డే మనుచున్నాఁడు.

ద్వి. సావిత్రి! నీ దగుసాధ్వీమహత్త్వ
మే వారిజాక్షుల యెడ గాన నౌట
కర మర్థి వర మిత్తు కల్యాణి! నీకు
వరశక్తి నీ సత్యవంతుఁ డింపొంద
పదియారుయేఁడుల ప్రాయంబుతోడ
పదివేలయేఁడులు పాలించు ధరణి
వనిత! చతుర్దశ వత్సరప్రాయ
మున నుండు మూర్గురు పుత్త్రిలఁ గనియు
అని యిట్లు హరి బల్క నాయిందిరయును
మనమున సంతోషమహితయై చూచి
చిటులని గందంబు చెదరనివేణి
సట గాని శృంగారసరణి యెల్లపుడు
మాయనిమణుఁగును మహితసౌభాగ్య
మాయతంబున గల్గు నని యానతిచ్చె
హారుఁ డిచ్చె యెదురులేనట్టి జయంబు
హారురాణి యొసగెను అతిశోభనములు
ప్రౌఢత్వ మొసఁగెను బ్రహ్మ శారదయు
గాఢవాగ్విభవంబు కడువేడ్క నొసఁగె
ముప్పదిముక్కోటి ముఖ్య దేవతలు
తప్పక దేవేం ... ... తో గూడి
కామధేనువు మరి కల్పద్రుమములు
ప్రేమ చింతామణి పృథుశక్తి నొసఁగి

యేవేళ కెప్పుడు యేవి గావలయు
ఆవేళ కప్పుడె అవి యొన (గూర్చి)
... ... మిచ్చి చనుమని వారల బనిచి
సరవిగా నిజనివాసములకుఁ జనిరి.

త్రిపుద.

కొడుకు కోడలు మున్నుగాఁగను కోరి మంత్రుల గూడి వేడుక
పు ... ... దరుదెంచె వేడుక పురమునకును
వచ్చి ముదమున సత్యవంతుని వరుస పట్టము గట్టి యున్నెడ
వచ్చె కూతురిఁ జూడ లక్షణభద్రుఁడుఁ సతియుతముగాఁ
అరణ మిచ్చిన వస్తు చయముల నన్నియును గొని వచ్చి ముందర
గరిమతో నిడి కూఁతు నల్లుని గారవించి
వుభయవంశలలామ - నొదవె పుత్త్రశతంబు మాకును
త్రిభువనంబులు పొగడె నిది యుదీర్ణమహిమల్.

వ. అని వుపలాలించి మాళవిలక్షణభద్రులు తమపట్టణంబునకుం జనిరి. సత్యవంతుండును సావిత్రీసహితుండై రాజ్యపరిపాలనంబు సేయునప్పు డెటువలెను.

అర్ధ చంద్రికలు.

నెల మూఁడువర్షములు నెలకొనియె ధరణిఁ
పాఁడిపంటలు చాల ప్రబలమయి వెలసెఁ
జారచోరులవార్త దూరమయి పారెఁ
శోభనపరంపరలు పొరిది విలసిల్లెఁ
నిత్యోత్సవంబులను నెగడె ధర యెల్లఁ.

వ. మరి న్నెటువలెను.

ద్వి. పోలంగ సావిత్రిపుణ్యచరిత్ర
చాల సంప్రీతితో చదువునెవ్వాఁడు
వేడుక నెవ్వఁడు వినఁగోరు సతుల
కూడఁ బెట్టుక కథా గుణగరిమములు
తెలుపు నెవ్వఁ డతండు దీర్ఘాయు వగుచు

దశిమమై తామరతంపర గాఁగ
పుత్త్రిలు పౌత్రులు పుత్త్రికామణులు
మిత్రబంధులతోడ మెరయుచు నుండు
ముత్తైదువలు కడు ముదముతో వినిన
హత్తుగ ధనధాన్య మగ్గలం బగుచు
పెనిమిటి వళ్యుఁ డౌ పె ... ...
ఘనతతో చుట్టలకడ నుతి గాంచు
నలువగ వంధ్యలు నలువదినాళ్లు
పొలుచువేడుక శుచిర్భూతలై వినిన
సంతానవతు లయి సౌభాగ్యమొదవి
కాంతుమన్నన గల్గి కడు చెలంగుదురు
కన్యలు వినిరేని కడు రూపవంతు
ధన్యాత్ము పెండ్లియై తనయులు గలిగి
భోగభాగ్యంబులు పొలు పగ్గలించి
రాగిల్లి యుందురు రమణులై యెపుడు
ముద మొప్ప విధవలు మొగి వినిరేని
సదమలులై జన్మజన్మంబులకును
పతులతో గూడి సంపదల పెంపెక్కి
సుతపౌత్త్రిహితులతో సొరిది నుండుదురు.

వ. మరి న్నే మనుచున్నాఁడు.

శ్రీకాకుస్థకులాబ్ధిచంద్రుఁ డగు నా శ్రీరాముపేరం సుధా
పాకం బొప్ప రచించితిఙ్ఞ కవివరుల్ పాటించి కీర్తింప లో
కైకప్రీతి కుమారపెద్దనృపతిఙ్ఞ యింపై ధరఙ్ఞ మించఁగా
యాకల్యాణచరిత్ర యొప్పెసఁగుతఙ్ఞ యాచంద్రతారార్క్కమై.

మంగళమహాశ్రీశ్రీం జేయుఙ్ఞ

శ్రీ సీతారామార్పణ మస్తు

కరకృత మపరాధం క్షంతు మర్హంతి సంతః

శ్రీమతే రామానుజాయ నమః.